# తారలు ఎలా రాలిపోతాయి?

ఆమె మహా నటి.. తన పాత్రలలో జీవిస్తుంది తప్ప నటించదనే ప్రశంసను అన్నివర్గాల వారినుండీ అందుకున్న మహానటి...లక్షలాది సినీ ప్రేక్షకుల హృదయాల్లో సుప్రతిష్ఠితమైన కీర్తి ఆమెది. చలన చిత్రరంగ గమనాన్నే శాసించగలిగేంత స్థానాన్ని స్వంతం చేసుకున్న ప్రముఖురాలామె. కళా జీవితానికి చరమావధిగా తోటి నటుడినే పరిణయమాడిన కళాకారురాలామె అలాంటి మహా నటి అకస్మాత్తుగా తారాపథం నుండి ఎలా రాలిపడిపోయింది? లక్షలను లెక్కచేయని వ్యక్తి పూటకు గడవని దుస్థితికి ఎలా దిగజారింది? నాలుగు బంగళాలున్న మనిషి ఇరుకిరుకు అద్దె కొంపలో ఎలా కాలూనగలిగింది?

సినీ మాయామేయ జగత్తులోని యదార్థ జీవన సత్యాలకు అద్దంపట్టే ప్రఖ్యాత తమిళ రచయిత అరందై నారాయణన్ నవల ''దివి నుండి భువికి'' నవంబర్ సంచికలో 'చతుర' సమర్పిస్తున్న సమగ్ర నవల చదవండి. నవల కాక అదనంగా చతుర మినీ కతలు, అద్భుత చతుర ప్రపంచం, రెండు రంగుల్లో ఆకర్షణీయమైన చిత్రాలు చతుర ప్రత్యేకతలు



## చతుర

ప్రతి నెలా ఒకటవ తేదీకి వెలువడే

నవ నవలా వేదిక

132 పేజీలు 125 పైసలే



Marketed By
**Margadarsi Marketing**
PRIVATE LIMITED
**Eenadu Compound, Hyderabad-500 004**

# చెమటకాయల యొక్క దురద, మంట బాధను మరిచి పోండి.









2 ప్యాక్‌లలో దొరుకును — "బ్లూ" మరియు "శాండల్ వుడ్"

**నైసిల్ పొందండి.**
**చెమటకాయలను మరువండి.**
**కేవలం 6 రూపాయల 63 పైసలు.***

*గరిష్ఠ రీటైల్ ధర. స్థానిక పన్నులు అదనం



చెమటకాయల పౌడర్ మాత్రమే మీకు దురదలు, మంటల చికాకుల నుండి అతి శీఘ్రంగా ఉపశమనము నిస్తుంది.
ప్రత్యేకమైన ఔషధీయుక్త నైసిల్ చెమటకాయలను ప్రతి దశలోనూ ఎదుర్కొంటుంది.

1. అధికమైన చెమటను ఆపుతుంది.
2. చెమటను పీలుస్తుంది.
3. దుర్గంధకారియైన సూక్ష్మ జీవులను నాశనము చేస్తుంది.
4. శరీరమునకు ఉపశమనము నిస్తుంది.

## ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938—1972]
శుక్రవారం : 9-11-'79
సిద్ధార్థినామ సం. కార్తీక బ. పంచమి
సంపుటము 73 : సంచిక 11
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
*
పోస్టులో ఏడాది చందా రు. 41-60
ఆరు మాసాల చందా రు. 20-80
విడి ప్రతి వెల 75 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

అట్టమీద బొమ్మ : 'గోరింటాకు'లో సుజాత

# గృహిణులకు గొప్పతనం చేకూర్చుతుంది!
# గృహానికి అందాన్ని చేకూర్చుతుంది!

డీలక్స

## Swaticane®

అర్థవృత్తాకారముగల కేన్

అర్ధ-వృత్తాకారము గల స్వాతికేన్ ట్రాన్సపరెంట్ సంచులలో ప్యాక్ చేయబడును.

- సువాసన గల అనేకమైన ఆకర్షణీయమైన రంగులు
- చేతిసంచులు, బుట్టలు, అలంకరణ వస్తువులు వివిధ డిజైనులలో తయారు చేయుటకు అనువైనది
- దృఢం, మన్నిక గలిగి వుండుటచే ఎక్కువ కాలం పని చేస్తాయి.
- మీ గృహానికి ఒక ప్రత్యేక అలంకరణ చేకూర్చుతుంది స్వాతికేన్.

Trade Mark Reg No
313694-B








తయారు చేయువారు :

**మహారాష్ట్ర ప్లాస్టిక్ ఇండస్ట్రీస్**

పోస్ట్ బాక్స్ నం. 7479
జోగేశ్వరి (తూర్పు)
బొంబాయి-400 060

# అమ్మా! నాబూటు ఎంత బాగా మెరుస్తుందో చూడు.



## టింకూ లాంటి బాబు మీకూ వుంటే రీగల్ కావలసిందేమరి! ఇండియాలో అత్యధిక శక్తి గల డిటర్జెంట్ బట్టల సబ్బు.

టింకూ లాంటి పిల్లలు ఉంటే బట్టలు ఉతికే పని అధికం. అందుకు 'రీగల్' మాత్రమే సరయిన డిటర్జెంట్ సబ్బు. 'రీగల్'కుగల అధిక తెల్లదనాన్నిచ్చే శక్తి ఎంతటి మురికినైనా తొలగించి, మీ బట్టలను తళతళలాడే తెలుపుతోను, వెలుగుతోను మెరిసేలా చేస్తుంది. లోనికి చొచ్చుకొనిపోయి మురికిని తరిమివేయగల–శక్తివంతమైన–నురుగునిచ్చేది 'రీగల్.' ఇతర డిటర్జెంట్ సబ్బులన్నిటికన్న ఎక్కువ ఉతుకులు ఇచ్చే 'రీగల్' మీకు ఎంతో పొదుపుచేస్తుంది 'రీగల్'ను మీ కుటుంబపు డిటర్జెంట్ సబ్బుగా చేసుకోండి.




Rediffusion D/766e/TL/R

సీరియల్

# ప్రేమపాశం

శ్రీమతి ప్రమీలా జనార్దన్

(గత సంచిక తరువాయి)

"ఈ రోజు నా జీవితంలో మరపురాని మధురమైన రోజు. పునాది రాయి వేసిన రోజు. ఆ రాయిమీద రాయిని కూడా లెక్కించలేమేమో ననుకున్నాను. కాని నేను అదృష్టవంతురాలిని. నా కోరిక నెరవేరింది." పూర్తయిన బిల్డింగ్ వైపు తన్మయంగా చూస్తూ అంది శాంతి.

"శాంతీ, నీ ఆశయం కోసం యెంతో కష్టపడ్డావు. అందుకే ఈ నర్సింగ్ హోమ్‌కు నీ పేరే పెడదా మనుకుంటున్నాను" అన్నాడు మనోహర్.

"ఊహూం. నే నెప్పుడో నా మనోహరుడి పేరు నిర్ణయించేశాను."

"శాంతీ..." నవ్వుతూ అన్నాడు.

"మనమూ, ఈ నర్సింగ్ హోమ్ కట్టడంలో రాళ్ళు, గుండే కాదు! మన అనురాగం, ఆనందం, నవ్వులు కూడా వున్నాయి. నేను నామ మాత్రంగా పని తలపెట్టాను. ఇంత తొందరగా పూర్తయ్యేందుకు శ్రమ పడ్డది మీరే. చిటపట ఎండలో పనివాళ్ళ వెంట తిరుగుతూ వాళ్ళతో పని చేయించే మిమ్మల్ని చూస్తే నాకు భయమే సేదొక్కొక్కసారి."

అప్పటి రోజులు గుర్తు చేసుకుంటూ గేటు దాటి లోపలికి వచ్చారిద్దరూ. కొద్ది అడుగులు రాగానే కుడివైపు కాస్త దిత్తులో అందంగా నిర్మించిన ఆ గది ఉంది. దాన్ని మనోహర్ చూపించాడు ఆ విధంగా.

"ఇక్కడ మన విశ్రాంతి గది కట్టించుకొందాం." అని అతనంటే "ఇక్కడెందుకు? వెనకవైపు కట్టించుకో వచ్చుగా." అంది శాంతి.

"ఊహూం. ఇక్కడి నుండి చూస్తే నగరం అద్భుతంగా కనిపిస్తుంది. ఇక్కడ చుట్టూ పూల మొక్కలు వేయించాలి ఈ చివర్నుంచి ఆ చివర అశోకా చెట్లు వేయించాలి."

అతడి కిష్టమైన విధంగానే అన్నీ చేయించాడు. అప్పుడే చెట్లు కూడా నాటించాడు.

నర్సింగ్ హోమ్ కట్టాలని శాంతి అన్నప్పుడు అదిప్పుడే సాధ్యం కాదన్నాడు. కాని తర్వాత ఆర్నెల్లకు తాను డిస్పెన్సరీ పెట్టిన చిన్న షెడ్‌ను ఆ చుట్టూ స్థలాన్నీ కొంటానని యజమానిని పిలిపించే వరకు అతనికి తెలియలేదు.

"శాంతీ, మొయ్యలేని భారం నెత్తిన వేసుకోడ మెందుకు?" ఆ రోజు మళ్ళీ అడ్డు చెప్పబోతే తేలిగ్గా నవ్వింది.

"బియ్యం బస్తాలు, సిమెంటు బస్తాలు నెత్తిన వేసుకుంటున్నామా?"

"చేతగాకపోతే వాటిని దించుకోవచ్చు"

"ఇదీ అంతే. డబ్బు లేనప్పుడు ఆగి పోతుంది. వున్నప్పుడు కడుతూ పూర్తి చేసుకుంటాం."

"ఇంతడబ్బుతో కూడిన పనివంత తేలిగ్గా అంచనా వెయ్యకు శాంతీ!"

"పని పూర్తి చెయ్యగలనన్న దృఢ విశ్వాసమే నన్ను అంత సీరియస్‌గా ఆలోచించ నివ్వడంలేదు. ప్లీజ్ నా మాట కాదనకండి. ప్రస్తుతం కష్టపడ్డా మున్ముందెంతో లాభం వుంటుందండీ."

శాంతి మాటలేకాదు, చేతలలో కూడ యేదైనా చెయ్యగలదనిపించిందతడికి, స్థలానికి మొత్తం డబ్బిచ్చిన ఆమెను చూసి.

"ఇంత డబ్బెక్కడిది?" ఆశ్చర్యంగా చూశాడు. తను ఇచ్చినది పదివేలే

"దొంగతనం చేశాను." నవ్వింది.

"ఎక్కడ?" తనూ నవ్వాడు.

"మీ దగ్గరే."

"అయితే పోలీసుల కప్పచెప్తాను." అని "నిజం చెప్పు శాంతీ అప్పు తెచ్చావా?" అడిగాడు.

"నేను చెప్పింది అబద్ధం కాదు."

"మీరిచ్చిన డబ్బులో మీకు తెలియకుండా

**జరిగినకథ 10:** తోటి డాక్టర్ను, కొడుకు విజయ్ బలవంతము చెయగా భార్య జానకికి ఆపరేషన్ చేసి ఆమెను కాపాడిన డాక్టర్ మనోహర్‌కు డాక్టర్ శాంతి వల్ల మారిన తన వైవాహిక జీవితం గుర్తుకొస్తుంది. తన జీవితం తనవారి ఉన్నతికి పునాది కావాలని అనుకొన్న శాంతి, వాళ్ళ అవహేళనలకు గురౌతుంది. మనోహర్‌ను అపార్థం చేసుకొన్నానని బాధపడి, అతనికి క్షమాపణలు చెప్పుకోటానికి వాళ్ల ఇంటికి వెళ్తుంది. అక్కడ మనోహర్ జానకిని హింసించటం చూసిన శాంతి అతనిని అసహ్యించుకుంటుంది. అపుడు అతడు జానకి వెనుకటి వృత్తాంతమంతా ఆమెతో చెప్తుంటాడు. తన తల్లిదండ్రులను ఎదిరించి మేనమామ కూతురు జానకిని పెళ్ళి చేసుకొంటాడు మనోహర్. కట్నం రాలేదనీ, తన కొడుకుకి అత్త వారింట జరగవలసిన ముచ్చటలు ఏవీ జరపలేదనీ మనోహర్ తల్లిదండ్రులు జానకిని హింసిస్తారు. భర్త మనసు అర్థం చేసుకున్న జానకి సహకారంతో శాంతి, మనోహర్‌ల వివాహం జరుగుతుంది. జానకితో కలిసివుండటానికే నిశ్చయించుకొని మనోహర్ ఇంటికి వచ్చేస్తుంది శాంతి. ఆ ఇంట్లో జానకి ఒక్కతే, ఆరోగ్యం సరిగ్గా లేకపోయినా అన్ని పనులూ చేయటం చూసి సహించలేక కామాక్షమ్మను పని మనిషిగా నిర్ణయించుతుంది శాంతి. అది చూసి ఒక్క శివయ్య తప్ప అందరూ అసూయ చెందుతారు. జానకితో శాంతి కలిసి మెలిసి ఉండటం చూసి తులశమ్మ బాధపడి, జానకిని దూషిస్తుంది. లలిత, వాళ్ల స్కూల్లో పనిచేసే నరేంద్రన్ ఎవ్వరికీ చెప్పకుండా గుళ్లో పెళ్లి చేసుకొంటారు. వాళ్లకు వారి తల్లిదండ్రుల ఆదరణ లభించక పోవడంతో వేరే కాపురం పెడ్తారు.

దాచిన సొమ్ము కొంత, నా సంపాదన కొంత అంతా కలిపాను.. నిజం'' అంది.

కిరణ్‌కు ఉద్యోగం వచ్చింది మొదలు శాంతి దగ్గర డబ్బు తీసుకోడంలేదు. ''ఇంతవరకు ఇచ్చింది చాలు, నేను తీసుకున్నది చాలు అంటాడు. రాధిక పెండ్లి కూడా నేనే చేస్తాను.'' అన్నాడు కిరణ్. అతడు మంచి ఉద్యోగంలో చేరాడు గనుక, ఎవ్వరిచ్చిన అవసరం కూడా కలపించ లేదా మొకు మాధవి పెండ్లై అత్తగారింటికి వెళ్ళిపోయింది.

ఇంటి వ్యవహారమంతా శాంతే చూసుకుంటూండడం వల్ల మనోహర్ జీతంరాగానే కొంత డబ్బు ఉంచుకొని మిగతా డబ్బే గకుండా, డిస్పెన్సరీలో ఆదాయమంతా ఆమె దగ్గరే వుంచమనేవాడు లలిత పెండ్లి చేసుకొని వెళ్ళిపోయిన తర్వాతే సుమిత్ర పెండ్లి చేశారు

ఇంట్లో పూర్వంలా ఖర్చు లేకపోవడం వల్ల, పొదుపుగా ఖర్చు పెట్టడంవల్ల బాగా డబ్బు మిగల్చ గలిగింది. శాంతి పుట్టింట్లో వాళ్ళకు డబ్బివ్వడం లేదన్న విషయం ఆ రోజే తెలిసింది మనోహర్‌కు.

''బిల్డింగ్ కట్టేందుకు కావల్సిన డబ్బు మాత్రం అప్పు తేవల్సిందే' అంది.

బ్యాంకు నుండి అప్పు లభించడం అంత కష్టం కాలేదు.

మనోహర్ హాస్పిటల్‌కు సెలవు పెట్టి అక్కడి పనులు చూసుకోసాగడు. శాంతి కొద్ది రోజులు అప్పుడప్పుడు వచ్చి చూసి పోతుండేది. బిల్డింగు రూపు దిద్దుకుంటుండగా శాంతి కూడా సెలవు పెట్టింది. ఒకరి నొకరు సంప్రదించుకుంటూ యెక్కడేం పెట్టాలో, ఆలోచించుకుంటుండే వాళ్ళు కూలీల మధ్య అలా తిరుగుతుంటే వాళ్ళకేదో క్రొత్త లోకంలో విహరిస్తున్నట్టనిపించేది. ఆ సమయంలోనే మనోహర్‌కు విశ్రాంతి మందిరం ఆలోచన వచ్చింది. యే ఇంజనీరును సంప్రదించకుండానే అతడి మనో ఫలకం మీద గీసుకున్న ప్లాను ప్రకారమే ఆ గదిని కట్టించ దలచుకున్నాడు.

నర్సింగ్ హోమ్ పూర్తయి సంవత్సరం లోపుగానే అప్పంతా తీరిపోయినట్లు కలలు కంటూంది శాంతి.

''శాంతీ, నీవు సెలవు పెట్టాక ముందు నాకిక్కడ ఉండాలంటే విసుగు పుట్టేది. యెంత తొందరగా పూర్తవుతుందా? అనిపించేది. కాని ఇప్పుడు పూర్తవుతున్నదేనని విచారం''

''యెందుకో!''

''మళ్ళీ జీవితంలో యెప్పుడైనా నీతో ఇలా గడపగలనా అని.''

''మనూ.'' ఆమె కళ్ళు మెరిశాయి.

''ఈ అనుభవం, ఆనందం యెప్పుడూ లభిస్తే విలువ వుండదు. జీవితాంతం మిగిలే మధుర స్మృతులవి.''

హాస్పిటల్ పూర్తవుతుండగా ''శాంతీ, మన హనీమూన్ పూర్తవుతోంది.'' అన్నాడు నవ్వుతూ.

''ఈ ఎండలో ఇసుకలో రాళ్ళమధ్య తిరిగినా, నీ తోడు కొండంత సంబరమిస్తుంటే హనీమూన్ కాదని యెలా అనగలను?''

మనోహర్ నర్సింగ్ హోమ్‌గా పేరు స్థిరమవ్వడం, ప్రారంభోత్సవానికి యేర్పాట్లు జరగడం పూర్తయ్యాయి.

శాంతి మనోహర్‌ల కండ్లలో తృప్తి కొట్టొచ్చినట్లు కనిపిస్తున్నది.

ప్రారంభోత్సవం నాడు స్నేహితులను వూళ్ళో కొందరి పెద్దలను ఆహ్వానించినా జానకి తోటే ప్రారంభోత్సవం చేయించాలన్నది శాంతి.



# ప్రేమ పాశం

"నే నెందుకు? పెద్దవాళ్ళెవరి చేతనైనా చేయించండి." అంది జానకి.

"ఇంత గొప్ప వ్యక్తిని యెదుట పెట్టుకొని వేరెవరి చేతో చేయించడమా? మీ హృదయంలో మనోహర్ స్థాన మెంత గొప్పదో నాకు తెలుసు. అతడ్ని ఆరాధించి అభిమానించే మీరే ఈ పని చెయ్యాలి."

"అలా అనుకుంటే నీవు చెయ్యడమే న్యాయం."

"లేదు జానకీ లేదు. మీరు పెట్టిన భిక్ష పొందుకొని అనుభవిస్తున్న నాకా అర్హత వుందని పించడం లేదు."

"జానకీ, కోరరానిది కోరడం లేదు. దీని కెందు కభ్యంతరం?" ఆ రాత్రి మనోహర్ అవడంతో ఇక కాదనలేక పోయింది.

ఆహ్వానితులందర్నీ పలకరిస్తూ తిరుగుతున్నది శాంతి.

"యే ఘనత లేని నేను ప్రారంభోత్సవం చెయ్యాలంటే సిగ్గుగా వుంది." మెల్లగా అంది జానకి.

"జానకీ" ఆర్తిగా అన్నాడు. "నీ త్యాగశీలత, వ్యక్తిత్వం గొప్పవాళ్ళ మనుకొనే వాళ్ళకందరికీ వున్నాయా? నీతో చేయించడమే నాకానందం. సిగ్గుపడాల్సిన పనిలేదు." ధైర్యం చెప్పాడు మనోహర్.

పసుపు పచ్చటి నల్లని జరీ అంచున్న పట్టుచీరలో యే దేవతో దివినుండి భువికి దిగివచ్చినట్లుగా వుంది జానకి. అందరూ గౌరవ భావంతో ఆమె వంక చూస్తూ ఆమె రూపును మదిలోనే ప్రశంసించు కుంటున్నారు.

ప్రారంభోత్సవం కాగానే అందరూ లోపలికి వెళ్ళి చూస్తున్నారు.

జానకి కక్కడ ప్రతి అడుగులో శాంతి మనోహర్‌ల రూపమే కనిపిస్తున్నది. అది శాంతి పట్టుదలకు ప్రేమకు ప్రతిరూపమనిపించింది. తనతో నడుస్తూ హాస్పిటల్ కట్టేటప్పటి రోజులను గుర్తుచేసుకుంటూ మాట్లాడుతున్న మనోహర్, కట్టడం గురించి అప్పుడు పనివాళ్ళతో పడ్డ అవస్థల గురించి చెబుతున్నా, తన ప్రేమ గాధను మిత్రురాలిగా తనతో చెబుతున్నట్లనిపించింది.

శాంతి యెంత బిజీగా వున్నా ఇంట్లో మాత్రం పిల్లలతో పిల్లలా ఆడుతుంది. పాడుతుంది. వాళ్ళ స్కూలు విషయాలు అడుగుతుంది. వాళ్ళకు కావల్సినవి వాళ్ళడగకముందే తెచ్చిపెడుతుంది.

పిల్లల కిప్పుడు రకరకాల బట్టలు, ఆటవస్తువులు.

కల్పన చిన్నపిల్ల కావడంతో మరీ ముద్దు చేస్తుంది. కాస్త మంచి డిజైన్ గౌను కనిపిస్తే చాలు, ధర విషయం ఆలోచించకుండా కొంటుంది.

"ఆంటీ, నేను డాక్టర్ని." అంటూ తమాషాగా ఆమెనుపరీక్షచేస్తుంటే "షూర్ బేబీ, నువ్వు డాక్టరు వవ్వాలి." అంటూ దగ్గరకు లాక్కొని ముద్దు పెట్టుకుంది.

"నీకో పాప పుట్టేంతవరకే దీని ముద్దు మురిపాలు." కాస్త దూరంలో నిల్చొని వాళ్ళ ఆటలు చూస్తున్న సుమిత్ర నవ్వుతూ అంది. సుమిత్ర పురిటికి వచ్చింది.

"పెళ్ళి తర్వాతే ఆ పాప." గంభీరంగా నవ్వింది శాంతి.

'ఈ ఆంటీనేనా? నే నసహ్యించుకున్నది!' అప్పుడప్పుడు పశ్చాత్తాపంగా అనుకుంటాడు విజయ్.

* * *

ఇది వరకు శాంతి ఒక్కతే ఉద్యోగానికి రిజైన్ చేసి నర్సింగ్ హోమ్‌ను చూసుకుంటుండేది. ఇప్పుడు అక్కడ పని బాగా యెక్కువ కావడం వల్ల మనోహర్ కూడా రిజైన్ చేసి విష్ణువర్ధన్‌ను కూడా రమ్మన్నాడు.

ఆనాడు మాట మాత్రంగా అన్న తన మాట మనసులో పెట్టుకొని కార్యరూపంలో పెట్టిన శాంతి పట్టుదల అతడికి ఆశ్చర్యం గొలుపుతుంది.

కబుర్లు చెప్పుకుంటూ నవ్వుతూ పని చేసే వాళ్ళతో పని చెయ్యాలంటే అతడికీ ఇష్టమే. ఆనందంగా ఒప్పుకున్నాడు.

* * *

గడుస్తున్నంత సేపు క్షణాలు నిముషాలనిపించే కాలం సంవత్సరాలను వెనక్కి నెట్టేస్తుంది.

అత్త, మామలు గతించారు. మరుదులు పెళ్ళిళ్ళయి వుద్యోగరీత్యా వేరే వూళ్ళలో వున్నారు.

పిల్లలు పెద్దవాళ్ళవడం వల్ల ఇప్పుడు

ఉ

జానకికి చేద్దామన్నా పని లేదు. స్వర్ణ పెండయి అత్తగారింటికి కూడా వెళ్ళింది. గతం మదిలో మెదులుతుంటే, ఆ రోజులు బాగున్నాయా, ఈ రోజులు బాగున్నాయా అని అలోచిస్తుంటుంది.

ఆలోచించగా మనోహర్ గుండెలో తానే నిండిపోయానన్న భ్రమ వున్నంత కాలం తానెంత అవస్థ పడ్డా హాయిగానే వున్నట్టనిపించింది.

ఆ తర్వాత శాంతి ఆదరణలో తనెంతో సంతోషంగా వుండాల్సిన మాట. కాని వుండలేక పోతుంది.

ఇక ఇప్పుడు...

గతం గుర్తొచ్చింది.

హాస్పిటల్లో పని ఎక్కువగా వుండడం వల్ల మనోహర్, శాంతి చాలా వరకు అక్కడే గడుపుతున్నారు.

ఇదివరకులా మనోహర్ తనతో యెక్కువగా మాట్లాడడం లేదు. అందు కతడ్ని తప్పు పట్టేందుకు వీల్లేదు. కాని తను అతడితో మాట్లాడకుండా, అతడ్ని చూడకుండా వుండలేదు.

శాంతి డాక్టర్. ఇద్దరూ ఒకే చోట ఒకే వృత్తిలో వున్నప్పుడు, తప్పనిసరిగా ఆ విషయాలు చర్చనీయాంశాలౌతాయి.

అంతే కాకుండా ఇంటి వ్యవహారాలన్నీ చూసేది శాంతే కాబట్టి, యేదైనా సంభాషణ వాళ్ళిద్దరి మధ్య జరగడం సహజం.

'వాళ్ళిద్దరలా వుంటే ఈర్ష్య పడుతున్నదా ?'

"లేదు లేదు. తనకు మనోహర్ పూర్తిగా పరాయి వాడిలా అయిపోతున్నాడని బాధపడుతున్నది. అతడి మాటల కోసం తపించే తను మనసు విప్పి మాట్లాడబోతే, అతడి బాధ్యతలు అతడికి తీరుబడి నివ్వవు. అతడడిగేది తను చెప్పేది తన ఆరోగ్య విషయం, తన పిల్లల విషయం తనకి నాడే కాదు, శాంతి వచ్చిన నాటి నుండి దిగుల్లేదు. శాంతి నిస్వార్థత, మంచితనాన్ని తలుచుకుంటే యెవరైనా ఇలా చెయ్యగలరా ? అనిపిస్తుంది.

విజయ్‌ను ఇంజనీరును చేసి ఈ రోజో రేపో విదేశాలకి పంపించాలని కలలు గనడం తప్పా, ఆమె కింకో ఆలోచన లేదు.

స్వర్ణ కోరుకున్నవాడ్నిచ్చి వాళ్ళు కోరినంత




# 23-11-'79 సంచికలో

## హాస్య సీరియల్ ప్రారంభం !

కట్నం ఇచ్చి పెండ్లి చెయ్యడం కన్నా ఆమెకు గట్టి కోరిక లేదు.

"కల్యాణా, చిన్నవాడు డాక్టరు ఆటలు ఆడడం కాదు. నిజ జీవితంలో కూడా డాక్టరువు కావాలి. నీవు గ్రాడ్యుయేటవ్ కాగానే నా స్థానం నీ కప్పగించి నేను రెస్ట్ తీసుకుంటాను." అంటూ కల్యాణను మెడిసిన్‌లో చేర్పించింది.

భోజనానికి పిలిచేందుకు గదిలోకి వచ్చిన జానకి, శాంతి కిటికీలోనుండి పసిపాప మాటలు పారబోస్తూ తనలో తనే నవ్వుకోడం చూసింది.

"యేమిటి చిన్నపిల్లలా పారబోస్తూ నవ్వుకుంటున్నావు ?" అంది

"చిన్నపిల్ల నెత్తుకొనే రోజులొస్తాయని." అని వాలుక్కురుముకుంది. తనలోనే దాచుకోవాలనుకున్న రహస్యం ఆపుకోకుండా బయటపెట్టినందుకు బాధపడుతున్నానని ఆమె ముఖకవళికలే చెబుతున్నాయి.

"శాంతి, యేమిటి నువ్వనేది ?" దగ్గరగా వచ్చి ఆమె వైపు సీసా వైపు మార్చి మార్చి చూసిన జానకి కంతా అర్థమయింది.

"ఇన్నాళ్ళా.."

"వద్దనుకున్నాము..."

"అర్థమయింది శాంతి. ఈ కుటుంబం కోసం... నా పిల్లల బాగుకోసం...యే స్త్రీ చెయ్యలేని పని చేశావు."

"ఇందులో త్యాగం యేముంది? తల్లిలా పిల్లల్ని ప్రేమించాను. ప్రేమించ బడ్డాను. ఈ అదృష్టం అందరికీ వుంటుందా ? కాకపోతే మాతృత్వం మహిళకు అద్భుతమైన వరం! ఆ వరం నాకూ కావాలని వుంది."

మనోహర్‌కు కూడా అప్పటివరకా విషయం తెలియలేదు.

"ఇంత త్యాగాన్నెందుకు కోరారు ?" అని జానకి నిలదీసి అడిగినప్పుడు స్థాణువయ్యాడు.

పిల్లలు పుట్టలేదని యెప్పుడూ అనుకోని

ఆమెతో అనే నవ్వుతూ 'పుత్రికామా!' అన్నాడు ఒకటి రెండు సార్లు.

“ముగ్గురు పిల్లలుండగా పిల్లలు కావాలనుకోడం యెందుకు? వాళ్ళను వృద్ధిలోకి తేవాలి.” అంది.

అవకాశం ఒట్టే ఆమె యెక్కువగా కుటుంబం గురించి ఆలోచిస్తుంది.

“శాంతీ, యెందుకిలా చేశావు? నే చెప్పినా అలా కోరలేదే!” అన్నాడు.

“మీరు కోరారని నే అనలేదే!” నవ్వింది శాంతి.

“నా స్వార్థం మనలు కొట్టి ఈ పిల్లల జీవితం పాడు చేస్తుందేమోనన్న భయమే నాకా ఆలోచన కలిగించింది. ఇప్పుడా భయంలేదు. యెవరి బ్రతుకులు వాళ్ళు దిద్దుకొనే జ్ఞానం సంపాదించుకున్నారు.”

“శాంతీ...” అతడి హృదయం పరవశించింది. 'యెంత ఉన్నత హృదయం నీది!' ఆమె మీద గౌరవం, ప్రేమ ఇనుమడించాయి.

* * *

“ఈ భవబంధాలు శాశ్వతం కాదు. మన దేహం కూడా మన వెంట రాదని తెలిసీ ఆశలు పెంచుకోడం, వాటికోసం పడరాని

# ప్రేమపాశం

పాట్లు పడడమెందుకు? నీటిబుడగ లాంటి బ్రతుకు గురించి యెన్నెన్ని ఆలోచన్లు! అందులో భాగమైనా భగవంతుణ్ణి గురించి ఆలోచిస్తే. యే కొద్ది సేపైనా మనల్ని మనం మరచి, ఆతణ్ని ఆరాధిస్తే, కలిగే ఆనందం. తృప్తి ఇంకెందులోనూ లభ్యం కావు. అసలు మన గురించి మనం ఆలోచిస్తే, ఆనందం వుండదు. తృప్తి అసలే వుండదు.

యెదుటివాడు నాకేం చేశాడని కాకుండా నేనతడికేం చేశానని అనుకున్న వ్యక్తి మనస్సు కదో విధమైన సంతోషం తప్పకుండా ఈ లక్షణం ప్రతి మనిషిలోనూ వుంటుంది. కాని అలా చెయ్యాలంటే మాత్రం స్వార్థపు పొర అడ్డు వస్తుంది. అది తొలగించుకొని బయటికి రాగలిగే వాడే ధన్యుడు...”

వేంకటేశ్వర స్వామి ఆలయంలో పండిత పామరులనాకర్షించే విధంగా భగవద్భక్తి బోధిస్తూ వేదాంతం చెబుతున్న శాస్త్రిగారి మాటలు జానకి నాలోచింప చేస్తున్నాయి. ఇది వరకు విన్న మాటలే 'అయినా ఆ సమయంలో క్రొత్తగా అనిపిస్తున్నాయి.

“ప్రేమగుణం ఇచ్చిన ఆ దేవుడికే ప్రేమ నంకితం చేసే జీవితం ధన్యమైనది. మోక్షం పొందగలది. భగవంతుడికి కావల్సింది కానుకలు కాదు నిండు మదితో అతణ్ణి ధ్యానించడం. అందువల్ల కలిగే హాయి డబ్బుతో కొనలేనిది. విలువైన కాలాన్ని కోపావేశాలతో, ఈర్ష్యాసూయలతో మనల్ని మనం హింసించుకుంటూ ఇతరులను కష్టపెట్టే బదులు ప్రశాంత జీవనం గడిపేందుకెందుకు ప్రయత్నించకూడదు?”

అతడు తనకే ఆ మాటలు ప్రత్యేకంగా చెబుతున్నట్లనిపిస్తున్నది జానకికి. ఆదే కంగా అతడివైపు చూస్తూ వింటున్నది. ఆలోచన్ల దాడికి తట్టుకోలేక ఈ మధ్య దేవాలయానికి రావడం అలవాటు చేసుకుంది. కాని తన కిక్కడ కూడా ప్రశాంతత లభించడం లేదు తన బంధాలు తెంచుకుంటే తప్ప ఆలోచన్ల నుండి విముక్తి పొందదు.

శాస్త్రిగారు చెప్పడం పూర్తయినట్టుంది. జనం లేచి వెళుతున్నారు.

జానకి మెల్లగా లేచి శాస్త్రిగారి దగ్గరికి వచ్చింది.

కండువా విదిలించుకొని భుజాన వేసు

కొని వెళ్ళిపోబోతున్న అతడు ఆమెను చూసి "యేం కావాలమ్మా?" అన్నాడు.

"ప్రశాంతత."

గంభీరంగా నవ్వాడతను. "అది నివ్వరూ ఇవ్వగలిగేది కాదమ్మా యెవరికి వారు సాధించుకోవల్సింది."

"నాలుగు రోజులుగా మీరు చెబుతున్నది వింటున్న నాకా విషయం తెలుసు..."

"చూడమ్మా, నీవు కలవారింటిదానిలా వున్నావు. యేమిటి నీకొచ్చిన కష్టం?" జాలిగా చూశాడు.

"సుఖాలందరికీ ఒకే విధంగా వుండనట్టే కష్టాలూ అందరికీ ఒకే రకంగా వుండవు యెవరెవరి మనసులను బట్టి వారి బాధ యెక్కువ గానూ, తక్కువగానూ కనిపిస్తుంది. ఆ. ఈ మాటలన్నీ యెందుకు గాని నాకు మీరో సహాయం చెయ్యాలి." అంది.

"చెయ్యగలదైతే తప్పకుండా చేస్తాను." అన్నాడు. అతడి ముఖంలో కాంతి, పవిత్రత గోచరిస్తుంటే తను కోరింది చెయ్యగలడని పించిందామెకు.

"స్థలం మారినంతనే మనసులు మారుతాయా? అని అనకండి. నేనీ ప్రదేశంలో నన్ను నేను మరవలేనని పిస్తున్నది. నేను భగవంతుణ్ణి మనసారా ప్రార్థిస్తూ ప్రశాంతంగా వుండాలంటే తప్పకుండా ఇక్కడి నుండి వెళ్ళిపోవాలి..."

అతడు మెల్లగా నవ్వాడు. "తాత్కాలికావేశంలో కలిగిన నిర్ణయమమ్మా నీది."

"లేదు. ఈ వాతావరణంలో నేనుండలేక పోతున్నాను. నా మెదడు ఆలోచనలతో వేడెక్కి పోతున్నది. కాదనకండి. నాకేదైనా మార్గం చెప్పండి." తన నిర్ణయం మారదన్నట్లు అంది.

"నీవు నిజంగా మనశ్శాంతి కలిగించేదదేనని భావించినట్లయితే తప్పకుండా చెప్తాను. రేపు ఉదయం ఇక్కడి నుండి నేను, మరి కొందరు మిత్రులు, తిరుపతి సమీపంలోవున్న ఆశ్రమానికి బయలుదేరుతున్నాం. నీకిష్టమైతే రావచ్చు. మేము అక్కడి నుండి రామేశ్వరం వెళ్తాము." అన్నాడు.

"నేను ఆ ఆశ్రమంలోనే వుంటాను." కృతజ్ఞతగా చూసి నమస్కరించింది జానకి.

* * *

తెల్లవారి తొమ్మిది గంటలకు ఫోను మ్రోగుతుంటే వెళ్ళి అందుకున్నాడు మనోహర్.

"విజయ్, యేమిటి మళ్ళీ చెప్పేది?" ఆందోళనగా అన్నాడు.

"నిజం నాన్నా, అమ్మ కనిపించడం లేదు" యేడుపు ముంచుకొచ్చింది విజయ్‌కు.

"నేను వస్తున్నాను." అంటూ రిసీవర్ పెట్టేసి గబగబ శాంతి దగ్గరకు వచ్చి చెప్పాడు.

శిలా ప్రతిమే అయింది శాంతి.

"క్విక్ శాంతి. ఇంటి కెళ్దాం." అతడు ఆందోళనగా అంటూ చెయ్యి పట్టుకొని లాగేంత వరకు ఈ లోకంలోకి రాలేదు. మరో గంటకు గాని విమ్లా రాదు. నర్స్‌లకు చెప్పి బయలుదేరారు.

"రాత్రి మామూలుగానే మాట్లాడారు. నాతో యేమీ చెప్పలేదు." విచారంగా అంది కామాక్షమ్మ.

"నేను నిద్ర లేచేసరికి మంచం మీద అమ్మ లేదు. యెంత మొద్దు నిద్ర పోయాను." యేడుస్తున్నది కల్పన.

# ప్రేమ పాశం

బట్టలేమైనా తీసుకెళ్ళిందేమోనని బీరువా తెరిచిన శాంతి, చీరలు కదిలించినట్లు కూడా లేకపోవడంతో భయంతో బిగుసుకుపోయింది. 'జానకి ఆత్మహత్య చేసుకున్నదా?' అలా అనుకుంటుండగానే కల్పన "ఆంటీ, నిన్న వుతికిన అమ్మ చీరలు, క్రొత్తగా అల్లిన వైర్ బ్యాగ్ కనిపించడం లేదు. నిన్న నీవు పుస్తకాలకని ఇచ్చిన మాటయాభై రూపాయలు నా పర్సులో పెట్టాను. అవీ కనిపించడంలేదు" అంటూ వచ్చింది. యేదైనా లెటర్ వ్రాసి పెట్టిందేమోనని ఆత్రంగా ఇల్లంతా గాలిస్తున్న వాళ్ళకు అవి కనిపించకపోతే, కాస్త రిలీఫ్‌గా వుంది కాని అంతరాంతరాలలో భయం మాత్రం పోలేదు.

"స్వర్ణ దగ్గరికెళ్ళిందేమో!" విజయ్ అంటే తల అడ్డంగా తిప్పాడు మనోహర్. "మనకు తెలియకుండా యెందుకు వెళుతుంది?"

"చీరలు తీసుకొని పోయిందంటే ఆత్మహత్య చేసుకొనే ప్రయత్నంలో మాత్రం వెళ్ళలేదనిపిస్తుంది కాని చీరెలు, బ్యాగ్, డబ్బు తీసుకెళ్ళిందో! లేదో! పర్సులో డబ్బు పోవడం ఇప్పుడు చూసుకుందేమో కల్పన! చీరలు యెక్కడో వుండి వుండొచ్చు" యెవరికి వాళ్ళు యెన్నో ఆలోచనలు చేస్తున్నారు అటు ఇటూ తిరుగుతున్నారు.

'దీనికి కారణం నేను...' అనుకున్న శాంతికి 'ఇన్నేళ తర్వాత తన కారణంగా వెళ్ళిపోతుందా?' అనిపించింది మళ్ళీ.

ఆ రోజు మంచినీళ్ళు కూడా ముట్టుకోలేదెవ్వరూ. కర్తవ్యం బోధపడడం లేదు. వూళ్ళో వున్న లలిత, సుమిత్ర, వాళ్ళ భర్తలు వచ్చారు మద్రాసులో వున్న స్వర్ణకీ విషయం తెలుపలేదెవ్వరూ. "మనం ఆలోచిస్తూ కూర్చుంటే లాభం లేదు. పోలీస్ రిపోర్ట్ ఇద్దాం." అన్నాడు నరేంద్రన్

అలా చెయ్యడం మంచిదే ననిపించింది మనోహర్‌కు కూడా.

అక్కడికి వెళితే యెన్ని ప్రశ్నలో! యెన్ని అనుమానాలో!

"ఆమె మీకేమౌతుంది?" మొదటి ప్రశ్న

"నా భార్య"

ఆ జవాబు వినడంతోటే సబ్ ఇన్‌స్పెక్టర్ ముఖంలో తీక్షణత కనిపించింది.

"ఆమెను కొట్టేవారా?"

'కొట్టడమా?' పేలవంగా నవ్వుకున్నాడు మనోహర్

"జానకీ. చూశావా. నీ ఈ చర్య యెలాంటి మాటలు వినేటట్లు చేసిందో! నీవు ఇటువంటి హింసలు భరించలేక యెటో వెళ్ళిపోయావని వాళ్ళ అనుమానం. అంత బాధలో వున్నప్పుడే అలా చెయ్యని నీవు ఇప్పుడు చేసావా? యెందుకలా చేశావు జానకీ." అతడి హృదయం ఘోషిస్తున్నది.

(ఇంకా వుంది.)

మీరు తెచ్చింది టెలివిజనా? అద్దమా?!

-వేణు

(గత సంచిక తరువాయి)



























[ఇంకా ఉంది]

## సీరియల్:

# సుదూర తీరాలు

### పొట్లబర్తి విజయలక్ష్మి

*(గత సంచిక తరువాయి)*

ఆ సాయంత్రం మామూలుగా కృష్ణాతీరానికి వెళ్ళిన మల్లితో ఈ వారం రోజులుగా కనిపించిన వుత్సాహం సంతోషం లేకపోగా, చిన్నబుచ్చుకున్న ముఖంతో దిగులుగా వుండటం చూసిన సూర్యం,

"హల్లో మల్లికగారూ! ఏమిటలా డల్‌గా వున్నారు? నావల్ల ఏమైనా పొరపాటు జరిగిందా? అలా తెలిసీ తెలియక ఈ దీనుడేమైనా మిమ్మల్ని నొప్పించివుంటే మృదువైన మీచేత్తో రెండు చెంపలూ వాయించండి భరిస్తాను అంతేగాని అందాల మీ మోము చిన్నబోతే ఈ అభాగ్యుడు చూసి భరించలేడు" అన్నాడు నాటకఫక్కీలో చిన్నగా తలవంచి మల్లి దగ్గరగా వంగుతూ

అంత వేదనలోనూ ఫక్కున నవ్వకుండా వుండలేకపోయింది మల్లి

"చూడండి! చూడండి! మిమ్మల్ని చూసి మేఘాలు కూడా ముఖం మాడ్చుకుంటున్నాయి మీరు నవ్వినా, మనసులో బాధ మీ ముఖంలో కనిపిస్తూనేవుంది ఈ దీనుడు వినకూడదా? వినతగడా?" అంటున్న సూర్యంను మధ్యలోనే ఆపుతూ,

"లేదు సూర్యంగారూ ఏమీలేదు మా బావ ఈ వారం రావడంలేదని వ్రాశాడు మీరేమో సోమవారమే ప్రయాణమని చెప్పారు బావ వస్తే నచ్చచెప్పించి మీతో వద్దామనుకున్నాను, బావను కూడా తీసుకొని కానీ యిప్పుడు అది అసాధ్యమని పిస్తోంది. నా కంతటి అదృష్టం లేదు సూర్యం గారూ!" అంటున్న మల్లి కంఠంలో జీర ధ్వనించింది కళ్ళలో నీళ్ళు సుళ్ళు తిరిగాయి అంత మంచి అవకాశం చేయిజారిపోతున్నందుకు చాలా బాధగా వుంది

"అరే! పెద్ద చిక్కే వచ్చిపడిందే... లొకేషన్స్ అన్నీ చూడటం పూర్తయింది మావాళ్ళంతా రేపే బయలుదేరుదామంటే, నేను సోమవారం వస్తాను మీరు వెళ్ళండని చెప్పేశాను పైగా మా బావగారికి మిమ్మల్ని తప్పకుండా నా వెంట తీసుకొస్తానని మాటిచ్చాను యిప్పుడెలా? పోనీ ఒక్కలా చేస్తే. మీరు మాతోపాటు వచ్చేయండి అక్కడికి వెళ్ళగానే టెలిగ్రాం యిచ్చి, మీ బావగారిని పిలిపిద్దాం! ఏమంటారు?" భయంగా చూస్తున్న మల్లి వైపు ఆదరంగా చూస్తూ,

"మీకేం భయంలేదు మీతోపాటే మా లక్కయ్య వుంటుంది మీ బావగారిని సర్‌ప్రైజింగ్ న్యూస్ యిచ్చి, ఆయన్ని డైరెక్ట్‌గా మద్రాసు రమ్మని టికెట్ కొని పంపుదాం మీరు మాతో వచ్చేశారని తెలిశాక ఆయన రాకుండా వుండలేరుగా ఇప్పుడు మీకింకా డౌట్ వుంటే, బావ వస్తాకుంటాడో లేదోనని అప్పుడింక ఆ డౌట్‌కు అవకాశం లేదు ఏమంటారు?"

"అమ్మో! అది నావల్ల కాదు! మాష్టారు వచ్చినా పరాయివాళ్ళతో నన్ను ఒంటరిగా పంపరు మా అమ్మకు ఈ విషయం తెలితే నన్ను నిలువునా పాతేస్తుంది ఇది జరిగే పనికాదు సూర్యంగారూ!"

సూర్యం ముఖం మాడిపోయింది

"అయితే యిన్నాళ్ళుగా మిమ్మల్ని గురించి ఎంతో గొప్పగా చెప్పి మిమ్మల్ని తప్పక తీసుకొస్తానని మా బావగారికి మాట యిచ్చిన నా పరువు ఏ గంగలో కలిసినా మీకు బాధ లేదన్నమాట చదువూ సంస్కారమున్నవారు నన్నింత అవమాన పరుస్తారనుకోలేదు" సూర్యం గొంతు కొంత తీవ్రంగా బాధగా ధ్వనించింది

"క్షమించండి సూర్యంగారూ! ఈ పరిస్థితిలో నన్నేం చేయమంటారు?"

"నేను చెప్పినట్లు చేస్తే ఈ గొడవలేమీ వుండవు మీరు మాతోబాటు రేపు రాత్రికే వచ్చేయండి మీ మాష్టారితో చెప్పవద్దు అమ్మతో చెప్పవద్దు. అందువల్ల మీ కోరికా తీరుతుంది అభివృద్ధిలోకి రావలసిన మీరిలా అంధకారంలో మునిగివుండడం నా కిష్టంలేదు మనం వెళ్ళగానే టెలిగ్రాం యిస్తాం కనుక మీవాళ్ళేమీ భయపడరు, మీ బావగారు ఎలాగూ మద్రాసు వస్తారు ఇంక భయం దేనికి? అలా కాకుండా మీరు ఇంట్లో చెప్పి బయలుదేరాలంటే అది మట్టుకు సాధ్యంకాదు మీరన్నట్లు వాళ్ళభ్యంతరపెట్టవచ్చు అప్పుడు వాళ్ళ మాట కాదనలేక ఆగిపోవలసిరావచ్చు — మీరు ఉత్తమ గాయనిగా మంచి పేరు తెచ్చుకునే అవకాశాన్ని చేజేతులా జారవిడుచుకున్నవారౌతారు ఆ తర్వాత మీరెంత బాధపడ్డా ప్రయోజనం వుండదు

నా ఫ్రెండ్స్ ఇద్దరు ముగ్గురు ప్రొడ్యూసర్స్‌కు కూడా మిమ్మల్ని గురించి వ్రాశాను వాళ్ళు కూడా తప్పక మీ కవకాశమిస్తారు నా మాట విని మాతో రండి. మిమ్మల్ని తర్వాత రమ్మని అడ్రసిచ్చి మేం వెళ్ళిపోవచ్చు కానీ వెళ్ళగానే పిక్చర్ పూజా, సాంగ్ రికార్డింగ్ ముహూర్తం పెట్టుకున్నారు మొట్టమొదటి పాట మీదే కావాలని నా కోరిక మద్రాసులో గాయనీమణులు కరువురాలేదు కానీ మీపట్ల నాకు కలిగిన అభిమానం మిమ్మల్ని ప్రపంచం గుర్తించేలా చేయమని ప్రేరేపిస్తుంటే, ఆ అతీతశక్తికి లోబడి కుక్కలా మీకోసం ఈ కృష్ణాతీరాన పడిగాపులు కాశాను ఇదే నేను చేసిన అపరాధం దానికి మీరే శిక్ష విధించినా భరిస్తాను కానీ నిస్వార్థంగా మీ ఉన్నతిని కోరుకుని మిమ్మల్ని ప్రోత్సహించాలనుకునే ఈ సూర్యాన్ని నిరాశపరచకండి మల్లికా? జీవితంలో ఏ ఓటమినీ భరించలేనివాడీ సూర్యం మిమ్మల్ని తీసుకెళ్ళకపోతే ఆ భావావేశంలో నేనేం చేస్తానో నాకే తెలియదు ఈ సూర్యుడు అస్తమించినా మీరు ఆశ్చర్యపడనక్కర్లేదు." కన్నీళ్ళతో అలా అంటున్న సూర్యాన్ని చూస్తే

మల్లి మనసు కరిగి నీరైంది పాపం! తనకోసం అతను మాటపడవలసిరావడం, అందుకు అతనంతగా బాధపడటం మల్లికి అయోమయంగా వుంది. నిస్వార్థంగా, స్నేహభావంతో తన అభివృద్ధిని కాంక్షించే సూర్యాన్ని నిరాశపరిస్తే తనకు వొరిగేదేముంది. అలా అని యింట్లో చెప్పకుండా అతనితో వెళ్ళడమంటే.

ఆలోచనల్లో మునిగివున్న మల్లిక వైపొకసారి క్రీగంట చూసి, లేచి నుంచొని నమస్కరిస్తూ—

"వస్తాను మల్లికా! బహుశా మీరింక నన్ను చూడలేరు వారంరోజుల్లో మీరందించిన అభిమానానికి, స్నేహ హృదయానికి కృతజ్ఞుడిని" అంటున్న అతని కంఠం రుద్ధమవడంతోపాటు కళ్ళు వర్షిస్తుంటే కర్చీఫ్‌తో అద్దుకుంటూ లేచి నిలబడ్డాడు అతని కళ్ళు ఎర్రగా జ్యోతుల్లా మెరిసిపోతున్నాయి.

తెల్లటి ముఖాన గాలికి రేగిన జుట్టు అందోకగా కదులుతోంది చీకటిలో కలిసే నల్లటి షర్ట్, దానిమీద కొట్టవచ్చినట్లు కనిపిస్తున్న ఎరుపు తెలుపు గీతలు తెల్లటి బెల్‌బాటమ్ పాంటూ ఆరోజు సూర్యం రోజూకంటే అందంగా వెలిగిపోతున్నాడు అప్రయత్నంగా ఏదో శక్తి ప్రేరేపించినట్లే నుంచునివున్న సూర్యం చేయి పట్టుకుని లేచింది మల్లి

సూర్యం కళ్ళు మిలమిలలాడాయి

మల్లి కళ్ళలో ఏదో తెలివి స్నేహార్ద్రత. ఏదో నిశ్చయం

---

***జరిగిన కథ-2:*** స్కూలు మాస్టరు దశరథరామయ్యగారి కుమారుడు మాధవ్ ఓ కంపెనీలో మేనేజర్ వారింట్లో వంట చేస్తున్న అన్నపూర్ణమ్మ కూతురు మల్లిచే మాధవ్ తను వ్రాసిన పాటలు పాడించు కొంటూ పరస్పరానురాగబద్ధులవుతారు కాని అతని ఎల్లెటూరి వేషధారణ మాత్రం ఆమెకు నచ్చదు మున్సబుగారు మాధవ్‌ను తన అల్లుడిగా చేసుకోవాలని పథకం వేస్తుంటాడు మల్లిని మంచి గాయనిగా గుర్తించి తమ పిక్చర్‌లోని పాటలు పాడటానికి, గొప్ప గాయనిగా పేరు ప్రతిష్టలు పొందటానికి తనతో మద్రాసు రమ్మని అర్థిస్తాడు సూర్యం

---

"సూర్యంగారూ! రేపు సాయంత్రం ఏడున్నరకల్లా యిదేచోట రెడీగా వుంటాను మిమ్మల్ని మనస్ఫూర్తిగా నమ్ముతున్నాను. వెళ్ళగానే మావాళ్ళకు టెలిగ్రాం యిచ్చి మా బావని పిలిపించాలి మీరు అంతేకాదు రేపు యిక్కడికి వచ్చేటప్పుడు మీ అక్కగారిని కూడా తీసుకురావాలి ఇంక నే వెళ్ళిరానా?" అంటున్న మల్లి చేతిని మృదువుగా నొక్కి వదిలేస్తూ —

"మెనీ మెనీ థాంక్స్ మల్లికా? మీకు, స్నేహం విలువ తెలుసు నేను పొరబడలేదు మీ నమ్మకాన్ని వమ్ముచేయను రేపు ఏడుగంటలకల్లా మా అక్కయ్యతో కృష్ణతీరాన నిలబడి మీకోసం ఎదురుచూస్తాను వెళ్ళిరండి ఆల్ ది బెస్ట్" అంటూ ముందుకు సాగాడు సూర్యం

సూర్యం వెళ్ళిపోయిన తర్వాత కూడా చాలాసేపు అలాగే కృష్ణలోకి దృష్టి సారించి ఆలోచిస్తూ కూర్చుంది మల్లి తనేం చేసింది? అమ్మకు, మాష్టారికి, బావకు కూడా తెలియకుండా ఒక అపరిచిత వ్యక్తితో మద్రాసు వెళ్ళిపోవడం ఎంతటి సాహసం? ఇంత ధైర్యం ఎలా వచ్చింది తనకు? సూర్యం మాటల్లో ఏదో మత్తు తనచేత అప్రయత్నంగానే అతనికి మాటిచ్చేలా చేసింది మాటిచ్చిన తర్వాత తప్పుకునే ప్రసక్తే లేదు

అయినా బావకీ శాస్తి జరగాల్సిందే అంత నిర్లక్ష్యంగా వెళ్ళిపోయాడు కదూ! తనూ అలాగే చెప్పకుండా వెళ్ళిపోతే అప్పుడు, అప్పుడు తెలిసొస్తుంది అబ్బాయిగారికి. "మల్లీ! మల్లీ!" అంటూ మద్రాసు పరుగెత్తుకొస్తాడు ఆ వూహతో మెల్లిగా తనలో తనే నవ్వుకుంటూ హుషారుగా గంతులేసుకుంటూ యింటిదారి పట్టింది మల్లి

మరునాడు మామూలుగానే తెల్లవారింది కానీ మల్లి అంతరంగంలో యుద్ధం చెలరేగింది వెళ్ళాలనే నిశ్చయానికి వచ్చి, వస్తానని సూర్యానికి మాట యిచ్చినా, అంత ధైర్యంగా యింట్లో అమ్మకూ, మాష్టారికి కూడా చెప్పకుండా వెళ్ళడమంటే... మనసులో గుబులు గుబులుగా వుంది. కాని భవిష్యత్తును గురించిన బంగారు కలలు, సూర్యం చూపిస్తానన్న రంగుల ప్రపంచం, ముక్కుపచ్చలారని, అర్థం శుద్ధం తెలియని పదహారేళ్ళ పడుచుదనం, ఉత్సాహంగా వురకలు వేస్తుంటే.. దాన్ని ఆపగల శక్తి మల్లికెలా వుంటుంది?

తల్లికి వంటపనిలో సాయం చేసింది మాష్టారి దగ్గిర కొంచెంసేపు కూర్చొని గీతాపారాయణం చేసింది ఓ ప్రక్క వుత్సాహం, మరోప్రక్క ఏదో తెలీని దిగులు మల్లిని ఒక్కచోట నిలవకుండా చేస్తున్నాయి

అనుకున్న సమయం ఆసన్నమైంది రోజూలాగే పెందలాడే భోంచేసి మంచమెక్కిన అన్నపూర్ణమ్మ, మాష్టరూ ఎనిమిది గంటలకే మంచి నిద్రలోకి జారుకున్నారు పల్లెటూళ్లలో ఏడు గంటలకే భోంచేసి, దాదాపు ఎనిమిది



గంటలకల్లా అంతా ప్రక్కలమీదకు చేరి నిద్రల కౌరుగుతారు అమ్మ ప్రక్కనే మంచంమీద పడుకున్న మల్లికి మాత్రం నిద్ర రావడంలేదు చాలాసేపు అటూ యిటూ పొర్లింది మరికొంచెం సేపట్లో మాష్టారి గురక వినిపించింది తల్లి కూడా మంచి నిద్రలోకి జారుకున్నదన్న నమ్మకం కలగగానే మెల్లిగా లేచింది

ఓ క్షణం తల్లి ముఖంలోకి విశ్చలంగా చూసింది అప్రయత్నంగా కళ్ళలో నీళ్ళు రాలాయి. పవిటచెంగుతో తుడుచుకుంటూ గదిలోకెళ్ళి రెండు జతల పావడాలు, వోణీలు, జాకెట్లు, మాధవ్ మురిపెంగా క్రితం నెలలో కొనుక్కొచ్చిన చీరా జాకెట్ తీసి బాగ్‌లో కూరింది త్వరత్వరగా. పెరటివైపు తలుపు దగ్గరగావేసి కృష్ణాతీరం వైపు చకచకా అడుగులేసింది

చుట్టూ పొలాలు, గాఢాంధకారం కీచురాళ్ళ మోత భయం పుట్టిస్తున్నా మల్లి అడుగులు వేగంగా బ్రిడ్జివైపు పొగాయి తెల్లటి బట్టల్లో రెండు ఆకారాలు కనిపించగానే తేలిగ్గా గాలి పీల్చుకుంటూ వాళ్లను సమీపించింది

సూర్యం రెండుగజాలు ముందుకు వచ్చి మల్లి చేతిలో బాగ్ అందుకున్నాడు చిన్నగా నవ్వుతూ

"మొత్తానికి అన్న మాట నిలబెట్టుకున్నారు నేనూ నామాట నిలబెట్టుకున్నాను ఈమె మా అక్కయ్య కుంతీదేవి" అంటూ ఎదురుగావున్న ఓ అందమైన నడివయసు స్త్రీని పరిచయం చేశాడు తెల్లటి జరీచీర, అంత చీకట్లోకూడా అందంగా మెరుస్తున్న పెద్ద కుంకుమబొట్టు, అందంగా చుట్టిన సిగలో అంతకంటే అందంగా అమర్చిన మల్లెలు . ఓ నిముషం అలాగే ఆమెవైపు రెప్పవాల్చకుండా చూసింది మల్లి

ఆదరంగా మల్లి చేయందుకుంటూ, "మల్లికాదేవి! మల్లికాదేవి, అని మావాడు తెగపొగుడుతూంటే, ఎంత పొడుగూ ఎంత లావూ వుంటుందో! అనుకున్నాను — సరిగ్గా పదహారేళ్ళు కూడా వున్నట్లులేవే సూర్యం!" అంటున్న ఆమె మాటలకు సూర్యం చికాకుగా "అబ్బ! ఎన్నేళ్ళో తిరిగ్గా లెక్కలు వేయవచ్చు ముందు కారు దగ్గరికి నడవండి, ఈలోగా ఎవరైనా చూశారంటే ప్రమాదం ఇంత శ్రమా బూడిదలో పోసిన పన్నీరౌతుంది" అంటూ హడావుడిగా బ్రిడ్జి కట్టుప్రక్కకు చేరుకొన్నాడు మౌనంగా కుంతీదేవి చేయి పట్టుకుమంటే ఆవిడ ననుసరించింది మల్లి

అంతా కారు ఎక్కి కూర్చోగానే కారు కదిలింది కారులో తన ప్రక్కనే మల్లిని కూర్చోబెట్టుకుంది కుంతీదేవి రెండోవైపు సూర్యం కూర్చున్నాడు ముందో స్థూలకాయం కూర్చొనివుంది ఆయన ఎవరో వాళ్ళు పరిచయం చేయలేదు ఆ కుంతీదేవి పేరే తమాషాగా వుంది మల్లికి యింతక్రితమెప్పుడూ అలాంటి పేరు వినలేదు భారతంలో తప్ప. పేరు ఏమైతేనేం మనిషి మంచిదానిలాగే వుంది . అనుకుంటూ దూరమై పోతున్న తమ పల్లెవైపు చూస్తూ చీకట్లోకి దృష్టి సారించింది మల్లి.



# సుదూర తీరాలు

మౌనాన్ని భంగంచేస్తూ —

"మల్లికా! యిప్పుడింకే భయం లేనట్లే గదా! యువార్ సేఫ్ నౌ. మా అక్కయ్య వుంది కనుక అంటే నామీద మీకు అంత నమ్మకం లేకపోయిందన్నమాట!' అన్నాడు చిన్నగా నవ్వుతూ సూర్యం

"ఛా! మీమీద నమ్మకం లేకకాదు. అంత దూరం ఎవరూ ఆడవాళ్ళు తోడు లేకుండా ఎలా రావాలా అని, మీ అక్కయ్యగారిని తీసుకు రమ్మన్నాను అంతేగానీ. ."

"పోన్లెండి రక్షించారు. నామీద అమాత్రం విశ్వాసముంటే చాలు" అంటున్న సూర్యం మాటలకు ఎందుకో కుంతీదేవి పగలబడి నవ్వింది.

సూర్యం కోపంగా చూశాడు ఆమెవైపు

అంతలోనే సర్దుకుంటూ, అందామె —

## పొగకు విరుగుడు

సాధారణంగా వంటయింటిలో పొగ పోకక మానదు. యీ పొగమూలాన అనారోగ్యం రాకతప్పదు అందువలన యీ పొగకు విరుగుడుగా, జపానులో చౌకగా లభించే "ప్యూరిఫైయర్' కనిపెట్టారు పొగను పరిశుభ్రంచేసే యీ చిన్న యంత్రాన్ని ప్రతీ గృహంలోను అమర్చుకోవచ్చు. వంటచేసే సమయంలో హైడ్రోకార్బనులు, కార్బను మోనాక్సైడ్ పొగరూపంలో తయారవు తాయి వీటిని ఆవిరిగా మార్చి, నీటి రూపంలోనూ, లేక కార్బన్‌డై ఆక్సైడ్‌గానూ యీ ప్యూరిఫైరు మార్చివేస్తుంది వీటికి అప్పుడే మార్కెట్లో మంచి గిరాకీ ఏర్పడింది. త్వరలోనే అన్ని దేశాలకు వీటిని ఎగుమతి చేయదలచారు

"పిచ్చివాడా! అసలు నిన్ను నమ్మకపోతే యిలా రావడానికి అంగీకరించేదే కాదు మల్లిక నీమీద పూర్తి భరోసా వుండబట్టే యింట్లో వాళ్ళెవళ్ళకీ చెప్పకుండా, రాత్రిపూట బయలుదేరి యింత ధైర్యంగా వచ్చింది ఏమంటావు మల్లికా! నేనన్న మాట నిజమేకదూ!" అంటూ తన ముఖం ఆమెవైపు తిప్పుకొని ఘనువుగా అడుగుతుంటే —

సిగ్గుగా తలాడించింది మల్లి

పరవశించిపోయాడు సూర్యం

అతని మనసు రెక్కలు కట్టుకొని ఆకాశ వీధుల్లో ఎగురుతోంది ఇంతటి సౌందర్యరాశి, అప్సరసను తలదన్నే అందాల రాణి, యింత తేలికగా తనతో వచ్చేస్తుందని, తన వలలో పడుతుందని వూహించలేదు

ప్రతి అసమాన సౌందర్యం వెనుకా అంతో యింతో అమాయకత్వం తప్పకుండా వుండి తీరుతుంది

అది సూర్యంలాంటివాళ్ళ చేతుల్లోపడి అధఃపతనమూ చెందుతుంది

కారులో మద్రాసు చేరేలోపలే కుంతీదేవి సూర్యంల ప్రవర్తన ఏదో వెగటుగా అసహ్యంగా అనిపించింది మల్లికి. తను తొందరపడిందేమో అన్న శంక కూడా కలగకపోలేదు మాటిమాటికీ సూర్యం ఆ కుంతీదేవి గుండెలమీదకు వొరిగిపోవడం, ఆవిడ పరవశించిపోతూ అతని తలను మరింత గట్టిగా గుండెల కానించుకోడం ఆ దృశ్యాలు కొన్ని జుగుప్సాకరంగా తోచాయి అయినా వాళ్ల గొడవ తనకెందుకులెమ్మని మౌనంగా కళ్ళు మూసుకుంది వాళ్ళిద్దరూ నిజంగా అక్కాతమ్ముళ్ళేనా! అనే అనుమానం మద్రాసు సమీపంలోకి వచ్చిన తర్వాత కలిగింది నిజం నింకడమీద తెలుస్తుంది తనెందుకు తొందరపడటం అనుకుని మౌనంగా కూర్చున్నా మల్లికి మాధవ్, మాష్టారూ, అమ్మా పదే పదే జ్ఞాపకం వస్తున్నారు తను తొందరపడి రాకుండా వుండాల్సింది అనుకుంది మరోసారి మనసంతా గుబులుగా వుంది

తెల్లవారి లేవగానే తను కనిపించకపోతే అమ్మా మాష్టారూ ఎంత ఖంగారుపడిపోతారు? ఆ ఆలోచన రాగానే కళ్ళనుంచి జలజలా రాలాయి కన్నీళ్ళు

కుంతీదేవి ముందు సీటు కానుకొని నిద్రకు జోగుతోంది సూర్యం చేతిలోని కర్చీఫ్ మల్లి బుగ్గల కానింది ఉలిక్కిపడి సూర్యం వైపు చూసిన మల్లికి ధైర్యం చెబుతున్నట్లుగా చూసి, కళ్ళు తుడుచుకొమ్మని సైగచేశాడు మౌనంగా కళ్ళు తుడుచుకుంది మల్లి

* * *

తెల్లవారింది రోజూ లేవగానే వాకిళ్ళూడిచి, ముగ్గులుపెట్టే డ్యూటీ మల్లిది ఏడుగంటలైనా మల్లి ముగ్గుపెట్టే జాడ కనిపించలేదు పొలాల వైపు వెళ్లిందేమో వస్తుందిలెమ్మని యెదురు చూసిన అన్నపూర్ణమ్మ ఎంతసేపటికీ మల్లి రాకపోవడంతో, తనే ఊడ్చి ముగ్గులుపెట్టి అన్యమనస్కంగానే పనులు చేస్తూ మల్లికోసం చూస్తోంది మాష్టారి చాటాలోకి చూస్తూ —

"మల్లీ! మల్లీ!" అంటూ కేకలేసింది, రెండుమూడుసార్లు

"ఇటు రాలేదమ్మా!" అన్నారు మాష్టారు

చుట్టుప్రక్కల అన్ని ఇళ్ళల్లోనూ అడిగింది

మాష్టారితో చెప్పింది ఆయనా వూళ్ళో అంతా చూసి ఎక్కడా కనిపించలేదని తిరిగి వచ్చాడు ఆదుర్దాగా

ఇద్దరికీ ఎటూ పాలుపోవడంలేదు అప్పటికే వూరంతా తెలిసిపోయింది

కొందరు పరామర్శలకు కూడా వచ్చారు

"మీ మాధవ్ దగ్గిర కెళ్ళిందేమో!" అన్నారు కొందరు

"చెప్పకుండా ఎందుకెళుతుంది? ఎలా వెళుతుంది?" అన్నారు మరికొందరు

"బట్టలన్నీ వున్నాయేమో చూశావా పూర్ణమ్మా" అందో ముత్తైదువ అప్పుడే గబగబా పెట్టె పొర్లించి చూసిన అన్నపూర్ణమ్మకు గుండె ఆగినంతపనైంది

"అన్నయ్యా! దాని బట్టలు మంచివి ఏవీ లేవు" అంటూ ఏడ్చేసింది

# మీ పసిపాపను గమనించండి









# సిరిలాక్®

## తో కలుగుతుంది

ఇది పాపకు పుష్టికరమైన
సంపూర్ణ ధాన్యపు పిండి ఆహారం.

పాలు, పంచదార...ప్రేమతో
పరిపూర్ణమైనది.




మీ పాపకు 3 నెలలు వచ్చేశాయా? అయితే మీ పాప నిండుగా పెరుగుటకు యిప్పుడు చక్కని సమపాళ్ళ దిట్టమైన ఆహారం చాలా అవసరమైవుంది.

సిరిలాక్ ...పాపలకు పుష్టికరమైన సంపూర్ణ ధాన్యపు పిండి ఆహారం ఇది యెంతో రుచికరమైనది ధాన్యపు పిండి, పూర్తి మీగడపాలు, పంచదారతో తయారైనది. మీ పాప పెరుగుదలకు అతి ముఖ్యముగా అవసరమైన పుష్టిని పూర్తిగా యిస్తుంది.

ఇందులో

- మీపాప ఆరోగ్యంగా వుండుటకు కావలసిన క్రొవ్వు పదార్ధములు, కార్బోహైడ్రేట్లు సరియైన సమపాళ్ళలో వున్నవి.
- మీపాప అనుదినం పెరుగుటకు తగినంత ప్రోటీనులు వున్నవి.
- మీపాప తేజముగ వుండుటకు అదనపు విటమినులు మరియు యినప శక్తి వున్నవి

-NESTLÉ

దీనిని తయారుచేయడం చాల తేలిక-దీనితో నీరు చేర్చండి-అంతే.



ముందుగా మరగబెట్టిన వీటితో సిరిలాక్ చేర్చండి.



బాగా కదపండి.



వెంటనే యిచ్చేందుకు తయారు.



'బొమ్మల కొలువు'లో జయమాలిని

# సుదూర తీరాలు

"ఇంకేం, మాధవ్ దగ్గరకే వెళ్ళుంటుంది లేమ్మా! ఈ వారంలో వాడు రానని వ్రాశాడని, పిన్నంతా ఓ మాదిరిగా వుంది. గుబులుగా వుండి వెళ్ళిందేమో! నేనిప్పుడే టెలిగ్రాం యిస్తానుండు" అంటూ పై పంచె భుజాన వేసుకొని బయలుదేరుతున్న మాష్టారికి ఎదురుగా వచ్చాడు పరమేశం.

"మాష్టారూ! మీతో కొంచెం మాట్లాడాలి." అంటూ ఆయన్ని లోపలికి తీసుకెళ్ళి చెప్పాడు.

"మాష్టారూ! నన్ను క్షమించండి. సూర్యం అని ఒకతను మద్రాసునుంచి వచ్చాడు. మ్యూజిక్ డైరెక్టరట, అతని బావేమో పిక్చర్ తీస్తున్నాడట, లొకేషన్ చూడాలని మన ప్రాంతాలకు వచ్చారట."

"అయితే యిప్పుడేవిటట!" అన్నారు మాష్టారు విసుగ్గా.

"అదే మాష్టారూ అతను... అతను మల్లిని తనవెంట మద్రాసు తీసుకువెళ్ళాడని..." మాట పూర్తిగాకముందే పరమేశం చెంప చెళ్ళుమంది.

"ఎంత ధైర్యంరా నీకు. మల్లిమీద అంత నింద వెయ్యడానికి నీకు నోరెలా వచ్చిందిరా!"

పరమేశం కళ్ళనిండా నీళ్ళు తిరిగాయి.

"నిజం మాష్టారూ! మీరు నమ్మరని తెలుసు. నేనూ నమ్మలేను. నాకీ ప్రొద్దుటే సూర్యం రమ్మన్న ప్రకారం ప్రక్క వూరు సైకిల్ వేసుకొని వెళ్ళాను. అక్కడి వాచ్‌మెన్ చెప్పాడు. ట్రావెలర్స్ బంగళాలో బస చేసినవాళ్ళు రాత్రే వెళ్ళిపోయారని చెప్పాడు. నాకు వేషమిస్తానంటే మా నాన్నకు తెలీకుండా రెండువేలిచ్చాను మాష్టారూ! అదికూడా తీసుకెళ్ళాడు. నాకు అడ్రసు కూడా ఇవ్వకుండ వెళ్ళిపోయాడు. నన్నే యింత మోసం చేశాడు. మల్లిని కూడా అలాగే మభ్యపెట్టివుండడని ఏమిటి నమ్మకం? పైగా ఆ వాచ్‌మెన్ చెప్పాడు. 'వచ్చేటప్పుడు కార్లో ఒకామె వుంది. సామాన్లు పెట్టుకొని పోయేటప్పుడు యింకో అమ్మాయి కూడా వుంది. ఆ అమ్మాయి కారు దిగలేదు. వాళ్ళ సామాన్లు పెట్టుకోగానే వెళ్ళిపోయారు' అని.

నేను రోజూ వాళ్ళ దగ్గరకు వెళ్ళేవాడిని. మొదట సూర్యానికి మల్లిని నేనే పరిచయం చేశాను. మనూళ్ళో ఎవరైనా అందమైన అమ్మాయి వుంటే చూపించమన్నాడు. హీరోయిన్ వేషం కూడా కొత్తమ్మాయికి యివ్వాలనుకుంటున్నాం అన్నాడు. నేను మల్లిని చూపించాను. కానీ సినిమాల్లో యాక్ట్‌ చేయదు, చక్కగా పాడుతుందని చెప్పాను. గాయనిగానే పరిచయం చేద్దాం, అంటూ మల్లితో మాట్లాడాడు.

ఆ తర్వాత ప్రొద్దుట రోజూ నన్ను వాళ్ళ బంగళాకు రమ్మనేవాడు. ఎక్కడెక్కడో కార్లో తిప్పేవాడు. అతని పెళ్ళాం కూడా వుంది వెంట. ఆవిడంత మంచిదికాదు. సాయంత్రం నన్ను వెళ్ళిపొమ్మని తను కృష్ణాతీరానికి చేరుకునేవాడు. మొదటిరోజు నాకు తెలియదు. రెండోరోజు వాళ్ళిద్దరూ మాట్లాడుకుంటుంటే చూశాను. ఆతర్వాత సూర్యాన్ని అడిగాను. 'మా ఆవిడకు తెలిస్తే గొడవౌతుంది. ఒక మంచి సింగర్‌ను తెరకు పరిచయంచేసే భాగ్యం నాకు దక్కనివ్వు గురూ! నువ్వెలాగూ హీరోవైపోతావు. మీ వూరమ్మాయి హీరోయిన్ అయితే మరీ మంచిది. కనుక నువ్వీ విషయం రహస్యంగానే వుంచు. నేను మల్లిని నెమ్మదిగా దారిలోకి తీసుకొస్తాను' అని చెప్పాడు. దుర్మార్గుడు ఇంత మోసం చేస్తాడనుకోలేదు మాష్టారూ! ఇది తప్పకుండా వాడి పనే సందేహంలేదు. ఇన్నాళ్ళూ వాడు నాకు హీరో వేషమిస్తాడనే ఆశతో మీకెవ్వరికీ చెప్పలేదు. మాధవ్ వూరెళ్ళిన దగ్గర నుంచీ వాళ్ళిద్దరూ రోజూ కలుసుకుంటూనే వున్నారు. నన్ను క్షమించండి మాష్టారూ!" అంటూ గబగబా తలుపులు తీసుకొని వెళ్ళిపోతున్న పరమేశం వైపు గుడ్లు అప్పగించి చూస్తూండిపోయారు దశరథరామయ్యగారు.

అప్పుడే అక్కడికి వచ్చిన అన్నపూర్ణమ్మకు ఏం సమాధానం చెప్పాలో తెలీని దశరథరామయ్యగారు యింకా ఏదో మిగిలివున్న ఆశతో చెప్పులేసుకొని పోష్టాఫీసుకెళ్ళి మాధవ్‌కు "మల్లి వచ్చివుంటే వెంటనే తీసుకొని బయలుదేరిరమ్మ"ని టెలిగ్రామిచ్చారు.

[ఇంకా వుంది]



# గమ్యం

డా. కె.వి. కృష్ణకుమారి

"అందరూ ఏమనుకుంటున్నారోయ్ !"

చేతినిండా నెయ్యి వొంపుకుంటూ రెండోసారి అడిగాడు ముసలాడు.

అసలే ముళ్ళమీద కూర్చున్నట్టున్న దివాకర్ ముభావంగా తలొంచుకున్నాడు.

"ఆఫీసులో పని ఎక్కువగా వుందేమిటోయ్!"

కలుపుతున్న కందిపొడిలో నెయ్యి ఎక్కువైనట్టుంది. కూతురు కనిపెట్టి గిన్నె ఎమ్మరిస్తుంటే, కడుపు కదిలేలా నవ్వుతూ – ఓరగా అల్లుడ్ని చూస్తూ – మాటవరసకి అడిగినట్టు అడిగాడు ముసలాయన.

"అవును." ఇంక తప్పదన్నట్టు మొహం చిట్లించాడు దివాకర్.

"ఈ తిరుగుళ్ళూ ఈ ఉద్యోగం నాకుమటుకు నచ్చలేదు. ఇంట్లోనూ, వంట్లోనూ – సుఖం లేకపోయాక ఎందుకొచ్చిన కలెక్టరూ ... అందుకే చిన్నాడ్ని ఐ. ఎ. ఎస్‌కి వెళ్ళకుండా మాన్పించేశాను."

కాటికి కాళ్ళు జాపుతున్నా – కక్కుర్తి బుద్ధులు పోని ముసలాడి జాతకం క్షుణ్ణంగా తెల్సిన దివాకర్‌కి మాట్లాడ్డం ఇష్టంలేదు. లంచాలు పట్టి – నల్లడబ్బు దొంతర్లు పెట్టి – ఆడపిల్లల పెళ్ళిళ్ళు ఘనంగా చేశాడు.

విషయం పాక్కాక పరువు వీధిన పడింది. ఉద్యోగం పోగొట్టుకుని – శ్రీకృష్ణ జన్మస్థానంలో కూర్చునివచ్చినా – ఎందుకో ఆ పొగరు ! – ఏమిటో ఆ గర్వం.

"మా నాన్న అంత ఇదిగా పలకరిస్తుంటే బెల్లంకొట్టిన రాయిలా కూర్చుంటారెందుకూ మాటలు రావటంలేదా ఏమిటి ?"

దురుసుగా – కరుకుగా – గది ప్రతిధ్వనించేటట్టు గద్దిస్తున్న లక్ష్మి ఉనికే దుర్భరంగా వుంది.

"ఏమిటి ?" కరుకుగా అంటూనే కంచంలో చేతులు కడిగేశాడు దివాకర్.

"మనిషేం మారలేదన్నమాట –"

"పొన్లే నాన్నా – ఆయన మారితే ఎవరికీ మారకపోతే ఎవరికి ?" వెడుతున్నవాడల్లా వెనక్కు తిరిగి చూశాడు దివాకర్.

అమ్మవార్లా అలంకరించుకున్న లక్ష్మి మురిపెంగా తన నగలవంక చూసుకుంటోంది.

కూతురి ఐశ్వర్యం – అంతస్థు అంచనాలు వేసుకుంటూ – సంబరంగా చూసుకుంటున్నాడా తండ్రి.

విసురుగా వెళ్ళిన దివాకర్ అప్రయత్నంగా ఆగిపోయాడు. అవమానంతో అతని మొహం ఎరుపెక్కింది. తనకోసం కేటాయించుకున్న హాలంతా – లక్ష్మి తాలూకు జనంతో – మూడో క్లాసు ప్రయాణీకు లాక్రమించిన ఫస్ట్‌క్లాస్ కంపార్ట్‌మెంట్‌లా వుంది. వరద బాధితులచేత ఆక్రమించబడ్డ – ప్రభుత్వ భవంతిలావుంది.

సామాన్లలాగే వాళ్ళూ అస్తవ్యస్థంగా వున్నారు.

అడ్డదిడ్డంగా సోఫాల్లోనూ – మెత్తటి కార్పెట్లమీదా – ఇష్టమొచ్చినట్టు పడుకుని – బంగారా పునాదులు కదిలేలా – కబుర్లు చెప్పుకుంటున్నారు.

కొందరు దివాకర్‌ని గమనించీ గమనించినట్టు సర్దుకున్నారు. మరికొందరు గమనించీ గమనించనట్టు ఊరుకున్నారు.

అవును – వాళ్ళు లక్ష్మి తాలూకువాళ్ళు – సంస్కారం ఎక్కడ్నుంచి వస్తుంది ? ఎక్కడుందని వస్తుంది ? ? అది లక్ష్మి ఇల్లన్న అహం వాళ్ళల్లో కన్పిస్తోంది. అది కల్పించింది లక్ష్మే – లక్ష్మి ! బుసలుకొట్టే త్రాచుపాము గుర్తొచ్చింది. గుర్తొస్తూంది.

విసురుగ తన గదిలోకి వెళ్ళి – విసుగ్గా తలుపు గడియపెట్టాడు. ఉలిక్కిపడ్డాడు.

మరదలు రమ – జారిపోతున్న పమిటను సరిచేసుకునే ప్రయత్నం చెయ్యకుండానే – లక్ష్మిలా కళ్ళార్పుకుంటూ మెలికలు తిరిగిపోతోంది. నేలచూపుల్లో – వోరచూపులు కలిపి – అనవసరంగా సిగ్గుపడిపోతోంది.

"నువ్వా! ఇక్కడా ! !" అసహ్యంతో కళ్ళు చిట్లించాడు దివాకర్.

"అన్ని గదుల్లో అందరూ వున్నారు. అన్నిటికన్నా ఈ గదే బావుంది బావా ! నేనొచ్చిన దగ్గర్నుంచీ ఇక్కడే పడుకుంటున్నా."

దివాకర్ మంచం చూపిస్తూ పులకరించి

పోతున్నట్టు మొహంపెట్టిన రమను చూస్తుంటే గొంగళిపురుగును చూస్తున్నంత కంపరంగావుంది దివాకర్‌కి.

"వచ్చిన దగ్గర్నుంచీనా? ఎప్పుడూ రావటం?"

విసుగ్గా — కరుగ్గా చూస్తున్న బావగారి విగ్రహాన్నే తన్మయంగా చూస్తూ చిన్నగా నవ్వింది రమ

"నువ్వు కేంప్‌కి వెళ్ళినరోజే — నేనూ, అమ్మా, నాన్నా, తమ్ముడూ వచ్చాం మొన్నేమో— అన్నయ్యలూ — వదినలూ వచ్చారు నిన్న అక్కయ్యలూ — బావలూ వచ్చేశారు — ఇవాళ నువ్వొచ్చేశావు."

ఆ కళ్ళార్పటంలో — ఆ సిగ్గుపడటంలో — లక్ష్మి పోలికలే ఎక్కువగా కన్పిస్తుంటే, చీదరించుకుంటూనే పర్యాలోచనగా చూశాడు ఈ మందంతా ఎందుకొచ్చినట్టు!

"బావా అందరం ఒకేసారి చచ్చిపోతాం. స్కైలాబ్ పడుతుందని అక్క అందరికీ ఫోన్లు చేసింది. అందరం వచ్చేశాంగా ఇప్పుడు పడినా ఫరవాలా —"

కదలిక లేకుండా నిలబడ్డ దివాకర్ తలుపు కొడుతున్న శబ్దం వింటూనే ఉలిక్కిపడ్డాడు

ఎంత పొరపాటైంది! గడియ అలాగేవుంది— చివ్వున దూసుకొచ్చి తలుపు గడియ తీసింది రమ

లక్ష్మిని చూసి పమిట సర్దుకుంది — కుచ్చిళ్ళు సవరించుకుంది

"ఛీ—పోదా—బావ గడియ పెట్టేశాడు —"

"ఛీ — ఛీ —"

స్కైలాబ్ శకలంగా, చీత్కారంతో దివాకర్ దగ్గరకొచ్చిన లక్ష్మి, దివాకర్ రౌద్రాకారం చూసి ఒకడుగు వెనక్కి వేసింది

"ఛీ — ఏమిటీ సంతా!!!"

"సంతేమిటి? నావాళ్ళొచ్చారు పిలిపించుకున్నాను — ఏం???"

"అదే ఎందుకంటున్నా"

దివాకర్ తీవ్రతకి — మరో పదిరెట్లు గొంతు పెంచింది లక్ష్మి

"ఎందుకో తెలీదా? కలెక్టర్‌గా మీరే ఉత్తర్వులు జారీ చేశారుగా అందర్నీ సురక్షిత ప్రదేశాల్లో వుండమని నావాళ్ళని వొదిలిపెట్టి

## కాలం

కాలం కొందరికి భగవంతుని కంఠహారం!
అదే మరొకరికి కలల కర్పూరహారం!
కాలమనే దేవత కమనీయ కటాక్షం
కొందరి కాంక్షల పరిపూర్తికి నవ వసంతం!
ఆ మధుమతి కన్నుల్లో విరిసిన తిరస్కారదృష్టి
ఎందరో కోర్కెల కోరకాలకు అనావృష్టి!
కాలాన్ని మస్తిష్కానికి మకుటం చేసుకొని,
జీవిత విశ్రేణిపై నడచిపోతారు కొందరు!
కాలాన్ని నిద్రమాత్రగా దిగ్రమింగి,
నిరాశా నిర్లిప్తతల లోయల్లో క్రుంగిపోతారు
కొందరు!
ఒకరికి కాలం ప్రియురాలు!
ఇంకొకరికి కాలం వెలయాలు!

— జి. భాను

## గమ్యం

నేనెలా వుండగలమా? — వాళ్ళెలా వుంటారు? ఒక్క దినాణం లేనివాళ్ళ కెలా తెలుస్తాయి ప్రేమలూ — అభిమానాలూ —"

దివాకర్ పిడికిళ్ళు బిగిశాయి

"మీరు బైట ఎలా ఊరేగినా — నే పట్టించుకోను రమ పెళ్ళి కావల్సిన పిల్ల"

"యూ బ్రూట్ —"

ప్రేలటానికి సిద్ధంగా వుంది అగ్నిపర్వతం

విసురుగా తలుపులు మూసిన చప్పుడైంది

అశాంతిగా ఫ్రిజ్‌డోర్‌మీద చెయ్యి వెయ్యబోయి తమాయించుకున్నాడు దివాకర్

ఉద్యోగ ధర్మం మండుతున్న గుండెకు మంచి మరకలా తగిలింది మానసికంగా అలసిన దివాకర్‌కి విశ్రాంతి తీసుకునే టైము గంట మాత్రమే -

ఈ స్కైలాబ్ ఎమర్జెన్సీలో ఆమాత్రం దొరకటం అదృష్టమా? దురదృష్టమేమో!

రమ మాటలు గుర్తుకువచ్చి విసురుగా దుప్పటి లాగి మూలకి విసిరివేశాడు దిళ్ళు రెండూ కాళ్ళవైపుకు గిరాటువేశాడు




టూర్‌లో అలిసిపోయిన శరీరం విశ్రాంతి కోరుతోంది. మండిపోతున్న మనసు మాత్రం సెగలు కక్కుతోంది. బాల్కనీలో నవ్వులూ — అరుపులూ — కేకలూ— కేరింతలూ — శృతిమించి వినిపిస్తున్నా — నిస్తేజంగా కళ్ళు మూసుకున్నాడు దివాకర్.

"బావ కివాళ బైటకు వెళ్ళాల్సిన పనుందేమిటి?"

బావమరిది సత్యం గొంతు పెద్దగానే వినిపిస్తోంది.

"ఏమో ఎవరికి తెల్సు." పుల్లవిరుపుగా వుంది లక్ష్మి గొంతు

"నాలుగువించీ ఎవర్నీ ఇల్లు కదలవద్దనీ — ఎవరివాళ్ళ దగ్గర వాళ్ళే వుండాలనీ — బావ కూడా ఆర్డర్లు జారీ చేస్తున్నాడుగా"

మరో బావమరిది నవ్వు డబ్బాలో గులకరాళ్ళు వేసినట్టు బాల్కనీ అంతా ప్రతిధ్వనిస్తున్నట్టుంది

"అవును. అందుకే మనందరం ఇక్కడున్నాం."

"అమ్మాయ్! అతనొస్తే కూడా చెప్పకూడదే ఇల్లు కదలొద్దని."

తండ్రికి సమాధానంగా లక్ష్మి ఫెళ్ళున నవ్వింది

"ఎందుకు? ఆ స్కైలాబ్ అతని నెత్తిన పడుతుందనా?"

విరక్తిని పెంచి శారీరకంగా కూడా తనని దూరం చేసుకున్న లక్ష్మి నుంచి ఏ మాటైనా వినటానికి అలవాటుపడిపోయిన దివాకర్‌కి — విరక్తిగావున్నా వినటం తప్పనిసరి అవుతోంది

"అపేక్ష వుండికాదు చెప్పేది వాళ్ళ నాయన దరిద్రాన్ని ఆసరాగా తీసుకుని ఎన్నోవేలతో అతన్ని కొనుక్కున్నామా — పైగా బోల్డంత డబ్బూ, పరపతీ ఖర్చుపెట్టి కలక్టర్ని చేశామా - బంగారు బాతులాంటి వాడు అతనుంటేనే ఈ బంగళా - ఈ హోదా..."

అష్టావక్రుడి లాంటి ముసలాడు — బోసినోటితోనే పగిలబడి నవ్వుతుంటే — మరికొన్ని కంఠాలు శృతి కలుపుతున్నాయి.

దివాకర్ దవడలు బిగపట్టాడు పిడికిళ్ళు బిగుసుకుపోయాయి 'రాస్కెల్స్ ఎంత ధైర్యం! ఎంత పొగరు' ఎన్నోసార్లలాగానే ఈసారి అలవాటుగా పళ్ళు నూరుకున్నాడు దివాకర్

ఎప్పటిలాగే మూర్ఖుల ముందు తన సంస్కారం ఓడిపోయింది ఈసారికూడా నాగరికత — అనాగరికత మృగాల ముందు తల వంచుకుంది

"వెళ్ళనియ్యి నాన్నా — ఆయుష్షుంటే సముద్రంలో పడేసినా ఈదుకొస్తాడు"

బూటుకి లేసు బిగిస్తున్న దివాకర్ కళ్ళలోంచి నిప్పులే కురుస్తున్నాయి.

కారు బంగళా దాటింది అప్రయత్నంగా తిరిగి చూశాడు తన బంగళా భయంకరమైన విషనాగుల్ని దాచుకున్న అందమైన పుట్టలా వుంది. పురుగుల్ని దాచుకున్న మేడిపండులా వుంది.

[ 35వ పేజీ చూడండి ]

# గొప్ప జతగా

## భారతదేశపు ఏకైక దుర్గంధనాశక సబ్బు మరియు టాల్క్

దుర్గంధంనుండి రెండురకాలుగా రక్షణకు సరైన జోడీ... సింథాల్ సబ్బుతో స్నానం, ఆపైన సింథాల్ టాల్క్ చల్లుకోవడం ..మీరు ఎంతో, మరెంతో తాజాదనంతో హాయిగా మురిసిపోయేందుకు.







**గోద్రెజ్ వారి సింథాల్**

Interpub/CTS/1/79/TL

# సినిమా విశేషాలు -జి. వి. జి.



'బడాయి బసవయ్య'లో సంగీత

## "బడాయి బసవయ్య"
## ఆశలు — అడియాసలేనా ?

గుండా సత్యనారాయణ సమర్పించే శ్రీ శక్తి చిత్ర "బడాయి బసవయ్య" వర్ణ చిత్రం ఔట్‌డోర్ షూటింగ్‌లో కెమెరా ముందు 'బడాయి బసవయ్య' పాత్రలో నూతన్‌ప్రసాద్, పెదవర్ధయ్య పాత్రలో పి. ఎల్. నారాయణ సిద్ధంగా ఉన్నారు డైరెక్టర్ బోయిన సుబ్బారావు చిత్రీకరణకు అనుజ్ఞ ఇవ్వగానే కెమెరాకు చలనం కలిగించారు కె. ఎస్. మణి

"యీ వూళ్ళో యెవరి నోట యిన్నా నీ మాటే! యెవరి నోట యిన్నా నీ మాటే — నీ మాటే! నీ మాటే!" అన్నాడు బడాయి బసవయ్య

"అట్టాగా! నేనేం జేశానంట అంత గొప్ప పనిని ?" అన్నాడు పెదవర్ధయ్య.

"అరవై యేళ్ళు నెత్తిమీదకొచ్చినా ముసలోడు, కొడుక్కి పెత్తనం యివ్వకుండా యేడిపిస్తున్నాడని..."

"యీ వూరు వూరంతా యేకమై కాకిగోల సేసినా నీకు మాత్రం పెత్తనం యియ్యవ్రా !... నీమీద నమ్మకంలేక గంటకో యేకరం తెగలేత్తావని బయ్యం. నీగ్గాని యిత్తే రేపు యీ పాటికి అదుగో అదుగో ఆళ్ళల్లో కలపేత్తావ్ నన్నుకూడా."

"ఛీ! వాళ్ళ కడుపున పుట్టినా దర్జాగా బతికేవాడ్ని రోజుకు రెండో మూడో దొరికేవి. యేవయ్యా! నువు పోయేదాకా నాకు పెత్తనం యివ్వ..."

"ఒరే, నేను నిజంగా సత్తే నీ కన్నీ కట్టాలేరా !"

"యేం వుండవులే. వొక్కసారి పోయి సూడు — నీకే తెలుస్తుంది."

"వారే, పోయాననుకో. నీ బ్యాటరీ డౌనవకుండా వుండాలని నన్ను గంధపు సెక్కల్లో తగలేస్తావా ? ఊరుని, గూడాన్ని పిలిచి, పెద్ద బంతులు పెడతావా ? అప్పుడు నీకు ఎంత ఖర్చు అయిపోద్దిరా !"

"యిదేంటయ్యా, ఖర్చవుద్దని పోవటం మానేస్తావా ?"

"వారే, నువ్వంటే నాకు శానా పేమరా నువ్వన్ని కష్టాలుపడ్డం నేను సూడలేన్రా !"

"అయితే, సచ్చిపోనంటావా ?"

"నేను సక్కబెట్టాల్సినయన్నీ సక్కబెట్టేశాక యివ్వుండమన్నా వుండకుండాపోతాలేరా !"

"నీకింత ఆశుంటే నాకు 'పెత్తనం యేమిత్తావ్? యీ బతుక్కి తాళాలగుత్తి పట్టుకునే యోగం లేదన్న మాట?" అంటూ నిట్టూర్చాడు బడాయి బసవయ్య.

బొప్పన సోమేశ్, వి. ఎస్. ప్రకాశరావు నిర్మించే "బడాయి బసవయ్య"కు పరుచూరి సంభాషణలకర్త. చక్రవర్తి సంగీత దర్శకుడు.

## "నిండు నూరేళ్ళు"లో
## తాతారావు తాత్సారం

సీత (జయసుధ) వంట చేస్తోంది. తాతారావు (చంద్రమోహన్) ఉషారుగా "లాలలా, లాలలా...!" అని పాడుకుంటూ లోపలికి వచ్చాడు "ఏమిటి, తాతారావుగారూ! రేడియో స్టేషన్‌లో ప్రోగ్రామ్స్ లేవా — మీకు డ్యూటీ లేదా — ఇంకా బయల్దేరలేదు ?" అంది సీత.

"ఉందండి. వెళ్తున్నాను... వెళ్ళేముందుగా మిమ్మల్ని చూసి, మీకో విషయం చెప్పి... ఏమిటంటే— లలలా.. లలలా ఆ విషయానికేం గానీండి — అసలు మిమ్మల్ని చూస్తుంటే నాకు భలే ఇదిగా అనిపిస్తుందండి... అమ్మగారు పోవడంతో ఇంటి బరువంతా నెత్తినేసుకున్నారు. పోయిన ఆవిడని ఉన్నట్టుగా భావించే మతి స్థిరం లేని నాన్నగారిని పసిపిల్లాడిలా చూసుకుంటున్నారు. నిజంగా మీరు..."

"పొగడకండి. పరిస్థితులకు బెదిరిపోక, బాధ్యతలనుంచి పారిపోక—సర్దుకుంటూ రావటంలో పెద్ద గొప్పేం ఉందండీ ?"

"నిజమేనండి. అసలు జీవితాన్ని పాటలా తేలిగ్గా తీసుకుంటే, లాలలా...లాలలా...లాలలా అని హాయిగా గడపొచ్చు దాన్నే వేటలా అనుకుంటే భయంతో పారిపోవలసివస్తుంది అవునూ — మొన్న ఉద్యోగం కోసం ఏదో ఇంటర్వ్యూకెళ్ళారు. ఏమైంది ?" అంటూ తాతారావు, సీతకు తెలీకుండా అక్కడున్న డబ్బాలో యాభై రూపాయలు పడేశాడు.

"ఏముందీ — మామూలే! మంచినీళ్ళకోసం ఎండమావికేసి పరుగెత్తడమే అయింది. అదిసరే, మీరు ఏదో విషయం చెప్పాలన్నారు ?"

"అదా ?... అది... ఇప్పుడు చెప్పనండీ. ఏదో ఒక రోజున 'యవనిక' తెర తెరుచుకుంటుంది. విషయం మీకే తెలుస్తుంది దాంతో — లలలా... లలలా... లలలా..." అంటూ చల్లగా జారుకున్న తాతారావువంకే చూస్తూ నవ్వుకుంది సీత.

మిద్దె రామారావు నిర్మించే శ్రీ రాజ్యలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ "నిండు నూరేళ్ళు" వర్ణ చిత్రానికి కె. రాఘవేంద్రరావు దర్శకుడు.



## దశ తిరిగిందిలో అపశకునపక్షి

రాఘవయ్య (వంకాయల) అరుగుమీద ఇటు అటు పచార్లు చేస్తున్నారు. కింద — వాకిట్లో కోదండం (సాక్షిరంగారావు) కూడా పడుమ్తా, పేపరు చదువుతున్నాడు: "తుఫాన్ ఉధృతం వలన తూర్పు గోదావరి జిల్లాలో తొంభైమంది మరణం. భీమవరం సమీపంలో బస్సు తిరగబడి, ఇరవైమంది మరణం. రాయవరం దగ్గర రైలు పట్టాలు తప్పి, మారుమంది..."

"మరణమేగా ? ఇక ఆపు! ఇక వార్తలే లేనట్టుగా చావు కబుర్లన్నీ చదువుతావెందుకు ?"

"ఈ రోజుల్లో ఈ పేపర్లో ఈ వార్తలు మామూలే! అన్నట్టు — మీరు ఎంతో గారాబంగా చూసుకుంటూన్న మీ ఏకైక పుత్రిక — అంటే, పట్నంలో కాలేజీలో చదువుకుంటున్నారు రాధమ్మగారు — పరీక్షలు ముగించి, ఈరోజే ట్రెయిన్‌లో ఇంటికి తిరిగి వస్తున్నారు. కారు స్టేషన్‌కు పంపించి చాలా సేపైంది. మామూలుగానే రావలసిన అమ్మాయిగారు ఇంతవరకు రాలేదు. కొంపతీసి, అమ్మాయిగారెక్కిన బండి పట్టాలు తప్పలేదుకదా ?"

"ఛా! నోర్ముయ్! నాలుగు గ్రామాలకు మోతుబరిని — నా అమ్మాయికి దారిలో ఏమైనా అయిందా ? ఏం చేస్తానో తెలుసా ? తర్వాత



'సుబ్బారాయుడు–సుబ్బలక్ష్మి'లో ఒక సన్నివేశం



'ప్రియబాంధవి'లో రంగనాథ్, రూప

చెప్తాను, అపశకునపక్షి !"

కోదండం అన్నట్టుగానే కారు దారిలో ఆగిపోగా — రాధ (దీప)ను గోపీ (మురళీమోహన్) తన ఎద్దులబండి మీద అక్కడికి చేర్పించాడు దాంతో రాఘవయ్యకు తల తీసేసినంత పనైంది "అదేమిటమ్మా! నాలుగు గ్రామాలకి మోతుబరి ఈ రాఘవయ్య కూతురు ఎద్దులబండి మీద ఇంటికి రావడమా ? కారేమైంది ?"

"నాన్నా, అది పేరుకు మాత్రమే కారుగాని, కారుకు వుండాల్సిన లక్షణాలు ఒక్కటిలేవు," అంది రాధ.

"పార్ట్‌లు కూడా కొన్ని లేవులెండి...ఇంతకీ, ఆ గోపీ ఎడ్లబండెక్కే మహాయోగం అమ్మాయిగారి కుందండి," అని కోదండం అనడంతో రాఘవయ్య అహం మరింత దెబ్బతింది "నువ్వు పదమ్మా లోపలికి. స్నానం అదీ కానియ్!" అంటూ కోదండం వంక తిరిగి, "నాకు ఆ కారు విషయమూ తెలుసు, నీ నోరు విషయమూ తెలుసు. నాలుగు గ్రామాలకు మోతుబరిని — నా కారే దారిలో ఆగిపోవడం నామోషి. దాన్ని ఇంటికి లాక్కొచ్చే ఏర్పాట్లు చూడు," అని హుకుం జారీ చేశాడు.

దగ్గుబాటి భాస్కరరావు, నిర్మించే అనంతలక్ష్మి ఇంటర్నేషనల్ వారి "దశ తిరిగింది" చిత్రానికి కట్టా సుబ్బారావు దర్శకుడు.

## సుబ్బారాయుడు — సుబ్బలక్ష్మి

"రెండవ షెడ్యూల్ అక్టోబర్ 25 నుంచి నవంబర్ 10 వరకు జరగడంతో చిత్రం పూర్తవుతుంది," అన్నారు దర్శక నిర్మాత కె. హేమాంబరధరరావు. నవీన్ పిక్చర్స్ "సుబ్బారాయుడు — సుబ్బలక్ష్మి" వన్నెల చిత్రంలో నూతన్‌ప్రసాద్, నరసింహరాజు, నాగభూషణం, పద్మనాభం, రావి కొండలరావు, సాక్షి రంగారావు, హరిబాబు, కవిత, జ్యోతి, మున్ని, అత్తిలి లక్ష్మి, జయమాలిని తారాగణం. భమిడిపాటి, సత్యం, షఘా, సిహెచ్. సుబ్బారావు, కె. బాబూరావు, నండూరి — రచన, సంగీతం, ఛాయ, కూర్పు, ప్రొడక్షన్, సహకార దర్శకత్వం నిర్వహిస్తున్నారు.

# అద్వితీయ విమల్

ఒక్క విమల్ మాత్రమే అసమానమైన
సూటింగ్స్‌ను తయారుచేసే విధానాన్ని
ఆకళించుకుంది. వెడ్డింగ్ సూటింగ్స్,
టెరెక్స్ HE×HE, హెర్‌మోడ్, ఓరియంట్
సిల్క్, ఇంకా ఎన్నో రకాలు.
అన్నీ ఉత్కృష్టమైనవే, అన్నీ మన్నవే.




సూటింగ్స్





భారత దేశంలో అత్యంత ఆధునికమైన టెక్స్‌టైలు
మిల్లువారి ఉత్పాదన



అనిల్ ప్రొడక్షన్స్ నెం. 4 లో ఒక దృశ్యం

## యుగంధర్‌లో జయం కోరే జయ

జయ (జయసుధ) రాకను గమనించి మదన్‌లాల్ (అర్జా జనార్దనరావు) చేతనున్న పుస్తకం మూసి, "అతనికేమైనా గతం జ్ఞాపకం వస్తోందా ?" అన్నాడు.

"కొద్ది కొద్దిగా ... ఇంకా పూర్తిగా మామూలు స్థితికి రాలేదు. ఏ వస్తువు చూసినా గుర్తుపట్టడానికి ప్రయత్నిస్తూ, అదేపనిగా చూస్తూంటాడు. లోగడకన్నా యిప్పుడు చాలా నయం," అంది జయ.

"మరి, నువ్వక్కడికెళ్ళిన పని పూర్తిచేయడానికి ఎందుకాలస్యం ?"

## సినిమా

"అతనికి మళ్ళీ జ్ఞాపకశక్తి పూర్తిగా రావాలి. చచ్చేముందు తను ఏ నేరానికి ఈ శిక్ష అనుభవిస్తున్నాడో అతనికి తెలియాలి. నేను రమేష్ చెల్లెల్ననీ, తను రమేష్‌ను చంపినందుకు ప్రతీకారంగా నేనతన్ని చంపుతాననీ అతనికి వివరంగా తెలియాలి. ఆరోజు త్వరలోనే వస్తుందని ఆశిస్తున్నాను," అంటూ జయ ఆవేశంతో పిడికిలి బిగించింది

## సినిమా

కె. ఎస్. ఆర్. దాస్ దర్శకత్వంలో పి. విద్యాసాగర్ నిర్మించే శ్రీ గజలక్ష్మి ఆర్ట్స్ వారి వర్ణ చిత్రం "యుగంధర్" నవంబర్ విడుదల.

### కె. రాఘవేంద్రరావు కొత్త చిత్రాలు

శోభన్‌బాబుతో క్రాంతికుమార్ నిర్మించే "మోసగాడు" వర్ణ చిత్రం షూటింగ్ అక్టోబర్ 24న ఆరంభమవుతుంది. శ్రీదేవి (ద్విపాత్రాభినయం), సత్యనారాయణ, గుమ్మడి ఇతర ముఖ్య తారాగణం. శ్రీ అన్నపూర్ణా సినీ ఎంటర్‌ప్రైజెస్ వారి నిర్మాణం.

ఠాగూర్ ఆర్ట్స్ పతాకంలో కె. ముఖర్జీ నిర్మించే వర్ణ చిత్రంలో మురళీమోహన్, రాజ్యలక్ష్మి, సత్యనారాయణ, జానకి, రావు గోపాలరావు, అల్లు రామలింగయ్య ప్రధాన పాత్రధారులు.

### "రాహుకేతువులు"

"డిసెంబర్ 10న ప్రారంభించి జనవరి 10వ తేదీకల్లా పూర్తిచేయదలిచాం," అన్నారు "రాహుకేతువులు" వర్ణ చిత్రాన్ని నిర్మించే నిర్మాత పింజల బాలాజీ. "ఆంధ్రప్రదేశ్‌లోనే ఔట్‌డోర్‌లో షూటింగ్ జరుపుతాం," అన్నారు బాలాజీ ఆర్ట్స్ వారి ఈ చిత్రానికి రచయిత, దర్శకుడు అయిన పేరాల సుబ్రహ్మణ్యం. నూతన్ ప్రసాద్, రావుగోపాలరావు, అల్లురామలింగయ్య, నరసింహరాజు ప్రభృతులు నటిస్తారు.

### కె. విశ్వనాథ్ కొత్త చిత్రం

చేగొండి హరిబాబు సమర్పించే చార్‌మినార్ మూవీస్ వర్ణ చిత్రంలో కమలహాసన్ హీరో. వి. వి. శాస్త్రి నిర్మాత.



'కల్యాణి రాముడు'లో కమల్ హాసన్, శ్రీదేవి

# నేడే మీరు మేలుకుంటే!

## మీ ప్రశాంత, సురక్షిత పదవీ విరమణ జీవితం... ప్రతినెల తరిగిపోని ఆదాయం... జీవిత కాలమంతా.. మేము మీకు హామీ యిస్తాం.



మీకు 50 యేండ్లు రాగానే మీ పదవీ విరమణగూర్చి ఆలోచిస్తూంటారు మీ బరువు బాధ్యతలంతా మీరు పూర్తి చేసినట్లు సంతోషిస్తారు మీ కుటుంబం విషయమై నిజంగా మీరు ముందుగానే ఆలోచించి, తగిన చర్య తీసికొని వుండియున్నచో, మీ కుమారుడు లేక మీ కుమార్తె సుఖంగా తమ జీవితంలో స్థిరపడియున్నారని చాలా సంతోషిస్తారు.

మీకు ప్రావిడెంటు ఫండు, గ్రాచ్యుయిటీ, జీవిత భీమా ద్వారా యెంతెంత మొత్తాలు రావాలో లెఖలు కట్టడం మొదలు పెడతారు ప్రతినెలా మీకు రాబడి వుండేట్లుగా యీ మొత్తాలను పెట్టుబడి పెట్టే సరియైన పద్ధతి యేదా అని ఆలోచిస్తూంటారు.

అప్పైన మీముందు ఒక గండి కనబడుతుంది

మీ జీవిత ప్రమాణాలను యెప్పటివలెనే జరుపుకోవాలంటే, యీ గండిని మీరు పూడ్చాల్సి వుంటుంది అయితే మీరు దీనిని సులభంగా సరిచేసికోవచ్చు. ప్రతినెలా మీ జీవితకాలమంతా మీరు ఆదాయం పొందే విధానాన్ని సిండికేట్ బ్యాంకు చూపిస్తూంది

ఇందుకై మీ సమీపమందలి సిండికేట్ బ్యాంక్ బ్రాంచియందు స్వయంగా వెళ్ళి తెలిసికోండి మేము మీకోసమే కాచుకొని యున్నాం డబ్బుకు సంబంధించిన మీ సమస్యల విషయమై యిప్పుడైనా లేక సమీప కాలమందైనా లేక రాబోవు కాలమందైనా మేము తగిన జాగ్రత్త తీసికొంటామనే ధైర్యంతో వుండండి

మా ప్రత్యేక పధకాలు

**క్యుములేటివ్ వార్షిక డిపాజిట్**

నెలకు రు 100 వంతున పది యేండ్లకాలం చెల్లించండి జీవితాంతం మీకు ప్రతినెలా రు 169-85 వస్తుంది ఇంతేకాకుండా మీ అసలు, వడ్డీతోసేరి (రు 20,557/-) అలాగే పదిలంగా వుంటుంది

**ప్రగతి రొఖం సర్టిఫికేట్**

తోచినంత స్వల్ప మొత్తాన్ని విల్లరగా పెట్టుబడి పెట్టి, అది ఫలితానికి రాగానే పెద్ద మొత్తాన్ని నిండుగా పొందండి



## సిండికేట్ బ్యాంక్

ఇచ్చట వయసు మళ్ళిన మీ జీవితాన్ని మేము జాగ్రత్తగా కాపాడుతాం.

maa SB 103 TEL.

'పరోపకారి పాపన్న'లో విజయ, చంద్రమోహన్

# సినిమా

## ఛాలెంజ్ రాముడులో కుంభకర్ణుడి కూతురు

అర్ధరాత్రి ... ఆ ఇల్లు తంత్రవేత్త (ఎక్సార్సిస్ట్) 'తంతా'గారిది. అంటే – తంగిరాల తాతారావుకు (హాస్యరూపం) 'తంతా' అన్న మాట! ఆయన కూతురు సుగుణ (సత్యకళ) చేమ చిటుక్కుమనకుండా వీధి తలుపు తెరుచుకు వచ్చి, ఆరుబయట పచ్చగడ్డిలో పక్కేసుకుని పడుకొని నిద్రపోతున్న రాజా (మోహన్‌ప్రసాద్)ని లేపింది "దెయ్యం! దెయ్యం!" అంటూ గాభరాతో లేచాడు రాజా. "నేను దయ్యాన్ని కాదు; సుగుణని. ఆరుబయట మనమిలా మాట్లాడుకోవడం భాగుండదు. లోపలికి రా!" అంది సుగుణ. ఆశ్చర్యం, ఆనందం ఒక్కసారి ముంచెత్తినా – అనుమానంలో "మరి, మీ నాన్న?" అన్నాడు "నిద్రోతున్నాడు పడుకున్నాడంటే లేపడానికి ఏనుగులచేత తొక్కించాల్సిందే!" అంటూ అతన్ని పడక గదిలోకి తీసుకొచ్చింది సుగుణ. మూడ్‌లోకి వెళ్ళిన రాజా నాటకంలో నాయకుడి ఫక్కీలో "ఇంటి మొత్తంమీద ఇదే సుప్రాశ్యకి వచ్చే గది సుగుణా! నిన్ను మొదటి చూపులోనే ప్రేమించాను – నేను ప్రేమ అనే 'పుడ్డు' తింటూ బతికే ప్రేమైక జీవిని. నా ప్రేమ తాజా హల్వా లాంటిది. ప్రేమకు నేనే వారసుడ్ని. నీ పాదదాసుడ్ని. ప్రేమభిక్ష పెట్టమని ప్రేమగా ప్రార్థిస్తున్నాను. ప్రియే! చారుశీలే!" అన్నాడు.

"ఛీ! బాగుండలేదు పాడు. ఇందాకే బాగా మాట్లాడావ్."

"దగ్గరికొచ్చాక దూరమెందుకు రాగముంటా!" అంటూ రాజా చెయ్యి వేసేసరికి సుగుణ షాక్ కొట్టినట్లు కెవ్వున కేకేసి, "ముట్టుకుంటావేంటమ్మా మరి?" అంది.

"మరి, పడగ్గదికెందుకు నన్ను తేవడం?"

"ఇది నా గది గనక. అట్టా దూరంగా కూర్చొని మాట్లాడు. ఎంచక్కా వింటాను."

"నేనేం స్పీకర్‌నా, హరిదాసునా – మాట్లాడి నిన్ను ఆనందింపచెయ్యడానికి?"

"నాకు దేశం మొత్తం చూడాలనుంటుంది రాజా! మా నాన్న నన్ను ఊరు దాటి పంపడు. అదిసరే, నువ్వేం చూశావ్?"

"అబ్బో – చాలా చూశాను. నన్ను పెళ్లి చేసుకుంటే, మన హనీమూన్‌కి ఓడెక్కి ఇండియా అంతా ఓ రౌండేసొద్దాం. నేను చూడని ఊరు లేదనుకో. ఢిల్లీ వెళ్ళి చార్‌మినార్ చూశాను. ఆగ్రా వెళ్ళి ఆంజనేయుడ్ని చూశాను. హైదరాబాద్ వెళ్ళి తాజ్‌మహల్ చూశాను. కాశ్మీరెళ్ళి మూడువైపులా వున్న సముద్రం చూశాను. కన్యాకుమారి వెళ్ళి తెల్లకాకుల్ని చూశాను. తిరపతి వెళ్ళి పాంబశివుడ్ని, మైసూరెళ్ళి వెంకటేశ్వరస్వామిని చూశాను," అంటూ ఓపికగా చెబుతున్నవాడల్లా, సుగుణ నిద్రాదేవత ఒడిలో ఒదిగి గుర్రుపెట్టడం విని, "జోలపాడ్డానికా నన్ను పిలిచింది? హుం! క్రితం జన్మలో కుంభకర్ణుడి కూతురై ఉంటుంది. కుంభకర్ణి!" అంటూ ఇంకేమీ చెయ్యలేక నెత్తి బాదుకున్నాడు.

ఎన్. టి. ఆర్., జయప్రద, గీత, పుష్పలత, సత్యనారాయణ, గుమ్మడి, రాళ్ళపల్లి, హరిబాబు, మిక్కిలినేని, మాస్టర్ పురుషోత్తం, గెస్ట్‌లుగా కాంతారావు, తాతినేని రాజేశ్వరి, రాఘవయ్య నటించిన అనిల్ ప్రొడక్షన్స్ "ఛాలెంజ్ రాముడు" వర్ణ చిత్రాన్ని టి. ఎల్. వి. ప్రసాద్ బి. యి. స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో తాతినేని ప్రకాశరావు నిర్మించారు. జె. మహేంద్రన్ కధకు బంధ్యాల సంభాషణలు, చక్రవర్తి స్వరకల్పనలో ఆత్రేయ, వేటూరి గీతాలు రాశారు. దేవరాజ్ ఛాయాగ్రాహకుడు. తోట శిల్ప దర్శకుడు. ఎం. కణ్ణన్ సంకలనకర్త. వి. కృష్ణమూర్తి నిర్మాణ నిర్వాహకుడు.

## తాతినేని రామారావు కొత్త చిత్రం

ఎన్.టి ఆర్., శ్రీదేవి నాయకా నాయికలుగా ఎ. పూర్ణచంద్రరావు నిర్మించే శ్రీ లక్ష్మీ ప్రొడక్షన్స్ ఆరవ చిత్రం త్వరలో సెట్స్‌కు వెళ్తోంది

## హిందీలో "కార్తీకదీపం"

శ్రీ లక్ష్మీ ప్రొడక్షన్స్ పతాకంలో ఎ. పూర్ణచంద్రరావు "కార్తీక దీపం" చిత్రాన్ని హిందీలో తాతినేని రామారావు దర్శకత్వంలో తీస్తారు. జితేంద్ర, రేఖ, మౌసమిఛటర్జీ ఆదిగా గలవారుంటారు. లక్ష్మీకాంత్ ప్యారేలాల్ సంగీత దర్శకులు.

# సినిమా

## ఎ. ఎన్. ఆర్. సమర్పించే మూడు అన్నపూర్ణ స్టూడియోస్ చిత్రాలు

దాసరి నారాయణరావు, కె. రాఘవేంద్రరావు, సింగీతం శ్రీనివాసరావు దర్శకత్వంలో మూడు చిత్రాలను వెంకట్ అక్కినేని, నాగార్జున అక్కినేని నిర్మిస్తారు. కె. రాఘవేంద్రరావు దర్శకత్వం నెరపే చిత్రం షూటింగ్ డిసెంబర్, జనవరి, ఫిబ్రవరి మాసాల్లో జరుగుతుంది. దాసరి రచన, దర్శకత్వంలో తయారయ్యే చిత్రం షూటింగ్ జూలై నుంచి అక్టోబర్ వరకు జరుగుతుంది. జనవరి, ఫిబ్రవరి, మార్చి నెలల్లో సింగీతం శ్రీనివాసరావు దర్శకత్వం వహించే చిత్రం పూర్తవుతుంది. మొదటి రెండు చిత్రాలలో ఎ. ఎన్. ఆర్ హీరో. మూడవ చిత్రంలో చంద్రమోహన్ హీరో అనీ, జంధ్యాల సంభాషణల కర్త అని ప్రచార శాఖ ప్రతినిధి శ్రీనివాస్ తెలియజేశారు.

ఎ. ఎన్. ఆర్ సమర్పణలో సెప్టెంబర్ 20న ప్రారంభమైన ఎ. ఎ. కంబైన్స్ "బుచ్చిబాబు" వన్నెల చిత్రం తొలి షెడ్యూల్ పూర్తయింది. "రెండవ షెడ్యూల్ నవంబర్ 1 నుంచి 10 వరకు కేరళలో జరుగుతుంది హీరో హీరోయిన్ల పై ప్రణయగీతాలు చిత్రీకరిస్తాం," అన్నారు కథ, మాటలు, స్క్రీన్‌ప్లే, బాధ్యతలు నిర్వహించే దాసరి నారాయణరావు. ఎ. ఎన్. ఆర్., జయప్రద, గుమ్మడి, నూతన్‌ప్రసాద్, మాధవి, రమాప్రభ వగైరా నటవర్గం. చక్రవర్తి స్వరాలను, సెల్వరాజ్ ఛాయను, భాస్కరరాజా శిల్పాన్ని, బాలు కూర్పును, బోసుబాబు ప్రొడక్షన్‌ను నిర్వహిస్తున్నారు. నిర్మాత . పి. వి. సుబ్బారావు.

'చుక్కల్లో చంద్రుడు'లో వెన్నిరాడై నిర్మల, జయంతి



## "తల్లిదండ్రులూ జాగ్రత్త!"

పై చిత్రానికి కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వం నిర్వహిస్తున్నట్లు తెలియజేశారు మోహన్‌దాస్. ప్రగతి మూవీస్ పతాకంలో వి. వి. ఎల్. ప్రభాకరరావు నిర్మాత. నూతన్ ప్రసాద్, ఈశ్వరరావు, ప్రసాద్‌బాబు, హరిబాబు, వేలు, శంకరనారాయణ, ప్రవీణ, సత్యచిత్ర, విజయగౌరి, మణిశ్రీ, సునీత పాత్రధారులు. గరిమెళ్ళ గోపాలరావు సంగీత దర్శకుడు. పి. వి. ఎస్. మూర్తి ఛాయ, కె. ఎల్. ధర్ శిల్పం, అంకిరెడ్డి కూర్పు గల ఈ వన్నెల చిత్రానికి బొగ్గిముంత కోటేశ్వరరావు, బి. కోటారెడ్డి సహనిర్మాతలు. అక్టోబర్ చివరన కడప ప్రాంతాల్లో షూటింగ్ ప్రారంభమై, ఒకే షెడ్యూల్‌లో నిర్మాణం పూర్తవుతుంది.

## విజయసారథీ కంబైన్స్

చక్రవర్తి ("గుండెలుతీసిన మొనగాడు") డైరెక్షన్‌లో ఒక క్రయిమ్ చిత్రం గన్నవరపు శర్మ నిర్మాణ నిర్వహణలో ప్రారంభమవుతుంది. ఈశ్వరరావు, శశిరేఖ, రాజబాల, సుధారాణి, లతాప్రియ, రంగస్థల నటుడు గన్నపరెడ్డి ముఖ్య భూమికలు నిర్వహిస్తారు. సత్యం సంగీత దర్శకుడు. కన్నప్ప ఛాయాగ్రాహకుడు. ప్రొడక్షన్ కంట్రోలర్ జి. డి. ఆనంద్

ఆడుతూ వస్తోంది

# నాలికపై నడయాడే ఓ కొత్త రుచి
# తితిత్తై తితిత్తై.... చక్ర టీ

చిక్కనైన చిక్కదనం
మహోన్నతం రుచి, సువాసనా అత్యుత్తమం !

రసవత్తరమైన కొత్త టీ–
రసికులు ఊరట్లూగే... చక్ర టీ–
నాణ్యతలో అత్యుత్తమమైన
తేయాకు. కొత్త చక్ర టీ ఇదిగో–కొత్త ఉత్పాదన

రసి కాగ్రేసరులకు–
మరొక మణిపూసలాంటి
**చక్ర టీ**






**టాటా-ఫిన్లే**
ఉత్పత్తి

daCunha/TF/CHT/2 Tel



'నన్నాయి అప్పన్న'లో జయప్రద, శోభన్‌బాబు

# సినిమా

## దాసరి చిత్రాలు మరికొన్ని

ఇతరుల రచనలకు దాసరి దర్శకత్వం వెలువడం, దాసరి రచనకు మరొకరు దర్శకత్వం వహించడం, దాసరి దర్శకత్వంలో రెండేళ్ళ తర్వాత తిరిగి సత్యనారాయణ నటించడం, తొలిసారిగా దాసరితో ఛాయాగ్రాహకుడు వి. ఎస్. ఆర్ స్వామి పని చేయడం — దాసరి అభిమానులకు ఆనందం కలిగించే విశేషాలు.

శ్రీ లలితా ఎంటర్‌ప్రైసెస్ : పాలగుమ్మి పద్మరాజు కథ ఆధారంగా జి. జగదీశ్‌చంద్రప్రసాద్ నిర్మించే చిత్రం షూటింగ్ జనవరి 19 న ప్రారంభమవుతుంది. మురళీమోహన్, మోహన్‌బాబు, జయసుధ, సుజాత, మాతవ్‌ప్రసాద్ ముఖ్య పాత్రధారులు. సత్యం సంగీత దర్శకుడు.

ఉమా ఫిలిమ్స్ కంబైన్స్ : గొల్లపూడి కథ, మాటలతో హరగోపాల్ (పూర్ణా) నిర్మించే చిత్రం షూటింగ్ నవంబర్ 10 న ప్రారంభమవుతుంది. మోహన్‌బాబు, ప్రభ, రాజ్‌బాబు, రమాప్రభ ఇంతవరకు ఎన్నికయ్యారు. శంకర్ — గణేశ్ సంగీత దర్శకులు. ''ఈ చిత్రం ఎక్కువగా రాత్రిళ్ళలోనే చిత్రీకరణ జరుగుతుంది,' అన్నారు నిర్మాత.

తారకప్రభు ఫిలింస్ : సుజాత నాయికగా ''సుజాత'' అనే వన్నెల చిత్రానికి దాసరి నారాయణరావు కథ, స్క్రీన్‌ప్లే, మాటలు సమకూర్చగా, దుర్గానాగేశ్వరరావు దర్శకత్వం వహిస్తారు. జనవరి 14 న షూటింగ్ ప్రారంభమై, మే 4 న విడుదలయ్యే ఈ చిత్రంలో మురళీమోహన్, మోహన్‌బాబు ముఖ్య భూమికలు నిర్వహిస్తారు.

జయకృష్ణా మూవీస్ : కృష్ణంరాజు సమర్పించే ''సీతారాములు'' వన్నెల చిత్రంలో కృష్ణంరాజు, సత్యనారాయణ, మోహన్‌బాబు, అల్లు రామలింగయ్య ప్రభృతులుంటారు. వి. ఎస్. ఆర్. స్వామి ఛాయ, సత్యం సంగీతం, జి. జి. కృష్ణారావు కూర్పు నిర్వహిస్తారు. ''జనవరిలో షూటింగ్ ప్రారంభమై, మార్చి నెలాఖరుకు పూర్తవుతుంది,'' అన్నారు నిర్మాత జయకృష్ణ.

## సమాజానికి సవాల్‌లో రాధను తొలగించిన బాంబు

రాధ (శ్రీదేవి)కి వున్నట్టుండి మెలకువ వచ్చింది. పక్కన విజయ్ (కృష్ణ) లేడు. ఓ చోట చీకట్లో బిక్కుబిక్కుమంటూ కూర్చొనుండడం చూసి, అతని దగ్గరి కెళ్ళింది. ''ఇలా చీకట్లో కూర్చున్నావేం, విజయ్ ?''

''రాధా ! ఆరోజు నాన్నగారన్నారు — విజయ్ చచ్చిపోయాడని. గుర్తుందా ? ఆ మాట నిజమే అనిపిస్తుంది, రాధా! నాలో — నన్ను నేను గుర్తుపట్టలేనంత మార్పొచ్చేసింది, రాధా! నాకు అన్యాయం చేస్తున్న భూషణాన్ని పలుగురి ముందూ చంపాను. అందుకు నేను బాధపడలేదు, రాధా! ఈరోజు వరాలయ్య అనే అమాయకుడ్ని — నన్ను నేను కాపాడుకోవడంకోసం, నా స్వార్థం కోసం నిర్దాక్షిణ్యంగా కాల్చి చంపాను. ఈ చేతుల్లో వెనుకటి శక్తి లేదు, రాధా! ఇవి పాపిష్ఠి చేతులు. ఓ పిరికిపంద చేతులు.''

''కాదు, విజయ్ ! నువ్వు పిరికివాడివి కాదు. ఓ ధైర్యవంతుడి బిడ్డవి. ఓ సాహసవంతుడికి తండ్రి కాబోతున్నవాడివి — అవును, విజయ్. మా అత్తగారికి ఎలాంటి బిడ్డను వరమిచ్చారో నాకూ అలాంటి బిడ్డనే ప్రసాదించమ్మా — అని కాళీమాతని కోరుకున్నాను. ఆ తల్లి కరుణించింది!''

విజయ్ విస్మయంతో రాధను దగ్గరికి తీసుకున్నాడు.

ఎస్. పి. వెంకన్నబాబు నిర్మించే శ్రీ ఉదయ్ ఆర్ట్ పిక్చర్స్ ''సమాజానికి సవాల్'' వన్నెల చిత్రానికి ఎస్. పి. రాజారాం దర్శకుడు.



## రెండు కొత్త చిత్రాల్లో జమున

శోభన్‌బాబు, శ్రీదేవి, మురళీమోహన్, జయచిత్రలతో గుహనాథన్ దర్శకత్వంలో డి. రామానాయుడు ప్రారంభించిన సురేష్ ప్రొడక్షన్స్ ''కక్ష'' వన్నెల చిత్రంలోనూ, కృష్ణ, శ్రీదేవి జంటతో కె. ఎస్. ఆర్. దాస్ దర్శకత్వంలో కుదరవల్లి సీతారామస్వామి నిర్మించే లక్ష్మీనారాయణ ఆర్ట్ పిక్చర్స్ వన్నెల చిత్రంలోనూ జమున నటిస్తోంది.

## వి. ఆర్ ఇంటర్నేషనల్

కనకాల దేవదాస్ దర్శకత్వంలో సంగీత ప్రధానమైన ఓ వన్నెల చిత్రాన్ని డి. భాస్కరవర్మ నిర్మిస్తారు. చంద్రమోహన్ ద్విపాత్రాభినయం, మాతవ్‌ప్రసాద్ ఏకపాత్రాభినయం లాంటి ప్రత్యేక ఆకర్షణలుంటాయి. నవంబర్ 26 న పాటల రికార్డింగ్, ఫిబ్రవరి 20 న అరకులోయలో షూటింగ్ ప్రారంభింపబడుతాయి. కె. శ్రీనివాస్ కథకు జంధ్యాల సంభాషణలకర్త.

## విజయనిర్మల కొత్త చిత్రం

హీరో కృష్ణతో ప్రసాద్, ఆదుర్తి భాస్కర్ నిర్మించే రవి కళామందిర్ వన్నెల చిత్రానికి ఆదివిష్ణు కథ రాశారు. జంధ్యాల సంభాషణలకర్త. మహదేవన్ సంగీత దర్శకుడు. ★

'భలే కృష్ణుడు'లో కృష్ణ



కారు దూరమౌతుంటే తనకు దూరమైన పెన్నిధి మరింత దగ్గరై కలవరం కల్గిస్తోంది. మనసులో నిండిన మనస్సైన మనసు — మనసులో ఇముడలేక అశాంతిని కల్గిస్తోంది

"ఎంత పొరపాటు చేశావు నాన్నా! ఎన్నెంత ద్రోహిని చేశావ్ ఎంత దురదృష్టవంతుడ్ని చేశావ్.'

ఈ లోకంలోలేని తండ్రిని తల్చుకుని ఎప్పటిలాగే అశక్తతనీ, అసమర్థతనీ గుండెల్లో దాచుకుని చెమ్మగిల్లిన దృష్టిని నిర్మానుష్యమైన వీధులవైపు కేంద్రీకరించాడు

"సార్! మావాళ్ళ ... ఇవాళ..."

దివాకర్‌కి ఎలా చెప్పాలో తెలీక తడబడిపోతున్నాడు డ్రైవర్

"ఇంట్లోంచి కదలద్దన్నారా?"

గంభీరంగా వుంది దివాకర్ గొంతు

"సర్ తమరు అనుమతిస్తేనే "

"వెళ్ళు జాన్ ఇవాళంతా నేను ఆఫీసులోనే వుండాల్సొస్తుంది మీవాళ్ళ దగ్గరుండు "

ఎటో చూస్తున్న దివాకర్‌ని మరో మాటడిగే ధైర్యం లేదు జాన్‌కి నిండు చూలాలైన భార్యా— తనమీదే ప్రాణాలు నిలుపుకున్న ముసలి తల్లీ తండ్రీ... వాళ్ళు తనని రమ్మని మరీ మరీ హెచ్చరించటం గుర్తుకువచ్చి — మరో మాట అనలేకపోయాడు

అప్రయత్నంగా రిస్ట్‌వాచ్ చూసుకున్నాడు

దివాకర్ ఓరగా చూశాడు

తనవాళ్ళ దగ్గరకు రెక్కలు కట్టుకు వాలాలన్న అతని ఆత్రుత చూచాయగా గమనించాడు—

అవును — సహజమే — ఎవరికివాళ్ళే తనవాళ్ళని చేరుకోవాలనీ — అవసరమైతే — తనవాళ్ళ సన్నిధిలోనే సంతోషంగా మరణించాలనీ — చేతులో వున్న ఈ ఆఖరి కోరికను తీర్చుకోవాలనీ — మృత్యుభయంతో తల్లడిల్లే ఈ సమయంలో—ఎవరికివారే అనుకోటంలో ఆరాటపడటంలో — అసహజత్వం లేదు లేదు

అతి సామాన్యుడైన డ్రైవర్ కూడా ఆ విధంగా అదృష్టవంతుడే — అందరి దృష్టిలో అదృష్టవంతుడైన తనకేదీ అదృష్టం ? — తనకెవరున్నారు ? — తనకోసం ఎవరున్నారు ???—

లేరా ? — ఎవరూ లేరా ? — నీకోసం ఎవర్నూ లేరా ??? — దివాకర్ గుండె బరువులోంచి — మస్తిష్క చలనంలోంచి — ఆవేదన అంచుల్లోంచి, అస్పష్టమైన ఆకారం స్పష్టంగా — జాలిగా — ఆత్మీయంగా, ఆప్యాయంగా — ఆరాధనతో -

తన కన్నీటి పొరల్లో మెరుపొచ్చింది — తన అణువణువులోనూ తనే ఐ చిత్ర విచిత్రంగా, తనలో నిండిపోతూ—వంటరితనాన్నుంచి దూరంచేస్తూ— తనకోసం వెలుగుతూ — తనకోసమే బ్రతుకుతున్న, ఒక దేవత స్మృతే — ఆ భావనే అద్వితీయంగా వుంది అపురూపంగా వుంది

"సంధ్యా!" దివాకర్ హృదయం ఆత్మీయతతో స్పందించింది

"దివాకర్! నీ ఉన్నతికోసం, నీ చదువు



# గమ్యం

[ 22వ పేజీ తరువాయి ]

కోసం, నీ భవిష్యత్‌కోసం మీ నాన్నగారు తను అమ్ముడుపోయారు నిన్ను అమ్ముకున్నారు. చెప్పలేని బాధ అయినది. చెప్పకోలేని వ్యథ నీది నిన్నూ, నీ పరిస్థితుల్నీ ఈమాత్రం అర్థం చేసుకోలేవా దివాకర్! నీ తండ్రిని ఋణ విముక్తుడ్ని చెయ్యటం నీ విధి నీ కర్తవ్యం.

దివా! డబ్బుకి అమ్ముడుపోయినందుకు విధికి తల వంచి, సమాజపరంగా విధిలేక మరో పెళ్లి నువ్వు చేసుకుంటున్నా — పవిత్రమైన మన అనుబంధం విధికన్నా బలవత్తరమైంది. మన అనురాగం విధినే శాసించేది. నువ్వు నా కోసం, నేను నీకోసం ఎప్పటికీ వుంటాము. వుంటాము దివా ... వుంటాము"

ఎన్నో పిన్నాటి సంధ్య ఇప్పుడు పరిక్రొత్తగా తన హృదయపు పొరల్లోంచి తొంగిచూస్తోంది.

# గమ్యం

తన మనసుని ఆలింగనం చేసుకుని కన్నీటితోనే ఓదార్చుస్తోంది.

"సంధ్యా — ఎక్కడున్నావ్! వంటరిగా ఎక్కడున్నావ్... ఎలావున్నావ్."

దివాకర్ కళ్ళ ముందు పేరుకున్న చీకటిలో సంధ్య వెలుగుతోంది. కొవ్వొత్తిలా వెలుగుతోంది. కొవ్వొత్తిలా!!

"సర్! మావాళ్ళ దగ్గిరకి వెడుతున్నా సార్!" కారు తాళాలందిస్తూ - వినమ్రంగా నిలబడ్డాడు డ్రైవర్.

అప్రయత్నంగానే తలూపిన దివాకర్ చేతుల్లో తాళాలు బిగుసుకున్నాయి.



"మావాళ్ళు ... మావాళ్ళు కావాలి ... నాకు మావాళ్ళని చూడాలనివుంది.

ఎలా? ఎలా! ఎలా!!

బద్దలౌతున్న తల రెండు చేతుల మధ్యా నలిగిపోతోంది. బద్దలైన హృదయంలో సంధ్య రూపం అస్పష్టంగా నవ్వుకుంటూంది. ఆ నవ్వులో జాలి వుంది — ఆవేదన వుంది — ఆరాధన వుంది— ఆప్యాయత వుంది — అనురాగం వుంది. అన్నీ తనకి కావాలి.

ఎలా!! ఎలా??

"సర్!"

ప్యూన్ వినయంగా నిలబడ్డాడు

"సర్...తమని చూడాలని ఎవరో వచ్చారు—"

"ఇప్పుడెవర్నీ చూడనని చెప్పు—"

"చెప్పా సార్... చాలా దూరం నుంచి వచ్చార్ట..." భయపడుతూనే విజిటింగ్ కార్డ్ టేబిల్ పైన పెట్టాడు.

"సంధ్య"

"సంధ్యా!!!"

సంభ్రమంగా లేచినిలబడ్డాడు దివాకర్.

తన అంతస్థు గుర్తుకు తెచ్చుకుని - ఆనందాన్ని అణుచుకుంటూనే అతి ప్రయత్నంమీద కూర్చోబోయాడు — కూర్చోలేక అసహనంగా నిలబడ్డాడు.

ప్యూన్ వింతగా చూస్తున్నాడు. గుడ్లప్పగించి చూస్తున్నాడు.

"సార్..."

"రాస్కెల్ — త్వరగా రమ్మను."

ఒక్క పరుగున వెళ్ళాడు ప్యూను.

పచ్చని పాదాలమీద జరీ అంచు ఎఱ్ఱ చీర మెరుస్తోంది — మృదువైన చెయ్యొకటి స్ప్రింగ్ డోర్‌మీద కన్పించి మాయమైంది — దివాకర్ హృదయం లయ తప్పుతోంది — గుండె వేగం తప్పుతోంది — మనసు స్థితిని దాటుతోంది తలుపులు మూసుకున్నాయి — తపించే కళ్ళు కలుసుకున్నాయి.

ఆ అందమైన కళ్ళల్లో - ఆ ఆర్తిలో - ఆ తపనలో — ఆ అనురాగ స్రవంతిలో - తన రూపం కన్పిస్తోంది.

నీళ్ళు నిండిన తన కళ్ళలో — ఆ మూర్తి నిండిన తన హృదయంలో — తన అణువణువులో సంధ్య రూపమే అగ్నిశిఖలా వెలుగుతోంది.

దగ్గరున్న హృదయాలు పెనవేసుకోటానికి ఆత్రపడుతున్నాయి. ఒకటే ఐన మనసులు ఒకటై పోవటానికి ఆరాటపడుతున్నాయి.

ఇద్దరిలో ఒకటే భావం — ఒకటే భాష - ఒకే వేదన — ఒకే స్పందన.

"సంధ్యా!"

చేతులు చాచిన దివాకర్ గుండెల్లోకి ఆత్రంగా చొచ్చుకుపోయింది సంధ్య. దగ్గరైన సంధ్యని ఆర్తితో హత్తుకున్నాడు దివాకర్.

"సంధ్యా! నిజమా...ఇది... ఇది నిజమా... నాకంత ... నాకింత అదృష్టమా..."

మాటలు కరవైన దివాకర్ పిచ్చివాడిలా తడబడిపోతున్నాడు. తన ప్రాణాన్ని ప్రాణాల్తో మూసుకున్న సంధ్యకి మాటలు కరువైపోయాయి.

ఎంతోసేపటికి తేరుకున్న దివాకర్ సంధ్యని పొదివిపట్టుకుని కన్నీళ్లతో తడబడుతూ చిన్నగా అన్నాడు. తృప్తిగా అనుకుంటున్నాడు.

"నాకోసం ... నాకోసం వచ్చావా సంధ్యా ... ఇన్నాళ్లూ నిన్ను పట్టించుకోని ఈ దుర్మార్గుడు ఏమైపోతాడోనని ... నాకోసమే వచ్చావుకదూ..."

సంధ్య కన్నీళ్ళు దివాకర్ గుండెల్లోకి వెచ్చగా హాయి ఇంకిపోతుంటే, మరింత తృప్తితో ఆ లేతపెదాలు కదిలాయి.

"నా ప్రాణాన్ని ప్రాణంతో మూసుకోటం కోసం — ఈ జీవచ్ఛవం వెతుక్కుంటూ వచ్చింది దివా ... నీకోసం ... నీకోసమే..."

తృప్తినీ ఆనందాన్నీ అతిప్రయత్నంమీద అణచుకున్న దివాకర్ అభ్యర్థనతో చూశాడు.

"సంధ్యా! ఈ పేదవాడ్ని కొంతకాలం పోషించుకోగలవా?"

సంధ్య కళ్ళు విస్మయంతో విప్పారాయి.

"కలెక్టర్‌గార్ని ఒక టీచర్ పోషించటమా?"

"కలెక్టర్ని కాదు — మామూలు దివాకర్‌ని. పోగొట్టుకున్న పెన్నిధికోసం పరితపిస్తున్న ఒక సామాన్యుణ్ణి. ఒక సామాన్యుడికూడా అందుబాటయే అదృష్టాన్ని ఇంక జారవిడుచుకోలేని అభాగ్యుడ్ని. ఒక మామూలు మనిషిని — నీ మనిషిని..."

మాటలు కరువైన దివాకర్‌ని ఆత్రంగా హత్తుకుంది సంధ్య.

"ఏమిటి ఏమిటీ మాటలు..."

"పదవిలేని నేను ఎవరికీ అక్కర్లేదు ... ఎటువంటి పదవైనా — నీకన్నా నాకెక్కువది కాదు ... అర్థంచేసుకున్నాను — అర్థం చేసుకో సంధ్యా!"

పాదాలమీద వొంగిపోతున్న సంధ్యని — తను పదిలపరచుకున్న స్థానంలో — పవిత్ర స్థానంలో— తన హృదయంలో — తృప్తిగా ఇముడ్చుకుంటున్న దివాకర్ కన్నీళ్ళు — అక్షింతలుగా సంధ్య నుదుటి మీద మెరిశాయి.

సంధ్య పెదాలపై నవ్వాయి.

# Some biscuits are more than just biscuits



The only True Yelakkai Custard Cream Biscuits are guaranteed to make any occasion special. The natural Yelakkai (Cardamom) is tastefully blended with choice wholesome ingredients presenting you with unique taste experience.




## Something special for someone special






Aurofood-India's most modern flour milling and biscuit-manufacturing complex.

# TRUE
## yelakkai
## Custard Cream Biscuits

Headstart/AT/206

# హైదరాబాదు నోట్‌బుక్

**కామకోటి పీఠాధిపతి ప్రశ్న :**

కంచికామకోటి పీఠాధిపతి శ్రీ జయేంద్రసరస్వతి పెంగ్విన్ టెక్స్‌టైల్స్ కర్మాగారం భవనంలో అక్టోబర్ 3వ తేదీన పత్రికా ప్రతినిధులతో మాట్లాడుతూ, మహమ్మదీయులు, క్రైస్తవులు, కమ్యూనిస్టులు అధిక సంఖ్యలో వున్న దేశాలు ఇస్లామిక్‌దేశాలుగా, క్రైస్తవ దేశాలుగా, కమ్యూనిస్టు దేశాలుగా ప్రకటించు కొంటున్నప్పుడు, హిందువులు అధిక సంఖ్యలో వున్న భారత దేశాన్ని హిందూ రాష్ట్రంగా ప్రకటించుకొనడంలో తప్పేముందని ప్రశ్నించారు. అంతమాత్రాన మైనారిటీలకు కలిగే నష్టమేమీలేదని ఆయన అన్నారు. ఈ సమావేశంలో ఉడిపి పేజావర్ మఠం అధిపతి శ్రీ విశ్వేశ్వరతీర్థ, ఆయన తర్వాత పీఠాధిపతి కాబోయే శ్రీ విశ్వవిజయతీర్థ పాల్గొన్నారు. వీరు ఆర్. ఎస్. ఎస్. కార్యక్రమాలలో ఎందుకు పాల్గొంటున్నారు? అని ప్రశ్నించగా, వారిలో ఎక్కువమంచితనం వుంది గనుకపాల్గొంటున్నానని ఆయన సమాధాన మిచ్చారు.

**అసెంబ్లీకి ఊరేగింపులు :**

ధరల పెరుగుదలను అరికట్టాలని నినాదాలు చేస్తూ, అభ్యుదయ మహిళా సమాఖ్యకు చెందిన ఐదు వందలమంది మహిళలు అక్టోబర్ 5వ తేదీన అసెంబ్లీకి వెళ్ళి, ముఖ్యమంత్రి డాక్టర్ చెన్నారెడ్డికి విజ్ఞాపన పత్రం సమర్పించారు. పర్షియన్ సింధుశాఖ దేశాలకు కూరగాయల ఎగుమతి వల్ల జంటనగరాలలో కూరగాయల ధరలు ఆకాశం అంటాయని, కనుక, ఎగుమతిని ఆపివేయాలని వారు విజ్ఞాపనపత్రంలో కోరారు.

జంటనగరాలలోని ఖాళీ స్థలాలలో గుడిసెలు వేసుకోడానికి అనుమతి ఇవ్వాలని కోరుతూ, జన సంఘర్ష సమితికి చెందిన ఐదువేలమంది గుడిసెలవారు అక్టోబర్ 5వ తేదీన అసెంబ్లీవరకు వూరేగింపు జరిపారు. పోలీసులు వారిని కంట్రోలు రూమువద్ద ఆపివేయడం వల్ల వూరేగింపు సమావేశంగా పరిణమించగా శ్రీయుతులు మహేంద్ర, పూల సుబ్బయ్య, మల్లు స్వరాజ్యం, కె. సత్యనారాయణ ప్రసంగించారు. పిదప శ్రీ జి. ఎం. అంజయ్యగారి నాయకత్వాన ఏడుగురున్న ప్రతినిధి వర్గం ముఖ్యమంత్రి వద్దకు రాయబారం వెళ్ళి, గుడిసెవాసుల వాంఛలు వివరించే విజ్ఞప్తి పత్రం అందజేసి అడ్డగుట్ట ప్రాంతంలో నివసించే వేయిమంది గుడిసెవారు ఖాళీ చేయాలని ఇచ్చిన నోటీసును ఉపసంహరించుకోవాలని కోరారు.

**యువజనులకు గవర్నర్ హితవు :**

అక్టోబరు 6వ తేదీ నుంచి నాలుగురోజులపాటు జరిగిన అంతర్విశ్వవిద్యాలయం యువజనోత్సవాలకు గవర్నర్ శ్రీ అబ్రహాం ప్రారంభోత్సవం జరుపుతూ, యువకులను ఉత్తమ పథంలో పెట్టి సత్పౌరులుగా తీర్చిదిద్దే బాధ్యత విద్యావంతులదని ఉద్బోధించారు. నేటి యువజనులు అపారశక్తి సంపన్నులని, వారిని సరైన మార్గంలో నడిపించక, సరైన అవకాశాలివ్వక నిందించి ప్రయోజనం లేదని ఆయన అన్నారు. యువకులు క్రమశిక్షణను అలవరచుకోవాలని ఆయన ఉపదేశించారు. పోలీసు ఇన్‌స్పెక్టర్ జనరల్ శ్రీ ఎం. వి. నారాయణరావు అధ్యక్షత వహించారు. యువకులు శీలాన్ని కాపాడుకోవాలని, సంస్కృతి రక్షణలో పెట్టని కోటగా వుండాలని ఆయన ఉద్బోధించారు.

**శ్రీమతి సుబ్బులక్ష్మి విరాళం :**

సుప్రసిద్ధ కర్నాటక సంగీత విదుషి శ్రీమతి సుబ్బులక్ష్మి గానంచేసిన శ్రీ అన్నమాచార్య రచిత శ్రీ వెంకటేశ్వర పంచరత్నమాల, తదితర కృతుల ఎల్.పి. రికార్డును ముఖ్యమంత్రి డాక్టర్ చెన్నారెడ్డి అక్టోబర్ 7వ ఉస్మానియా విశ్వవిద్యాలయం టాగోర్ ఆడిటోరియంలో ఆవిష్కరిస్తూ, ఆ రికార్డుల అమ్మకంపై రాయల్టీ ద్వారా లభించిన నాలుగులక్షల రూపాయలను వేంకటేశ్వరునికి సమర్పించారని తెలిపారు. దేవస్థానం కమిటీ అధ్యక్షులు డాక్టర్ ఎస్. రమేశన్ స్వాగతం చెప్పారు. జంటనగరాలలోని ప్రభుత్వ సంగీతకళాశాలలు, రాష్ట్ర సంగీత సభల సమాఖ్య, కళాసాగర్ ఇతర సంస్థలు శ్రీమతి సుబ్బులక్ష్మిని సన్మానించారు. తిరుమలతిరుపతి దేవస్థానం ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్ వందనసమర్పణ చేశారు.

**విద్యా లక్ష్యాలు :**

నల్లకుంట కాలనీలోని అనంత కేంద్రీయ విద్యా పీఠం అక్టోబర్ 2వ తేదీన నిర్వహించిన గాంధీ జయంతి ఉత్సవాలలో స్వామి రంగనాథానంద ప్రసంగిస్తూ, జాతి భవితవ్యం విద్యార్థుల మీదనే ఆధారపడిందని, అందువలన విద్యార్థులు నిజాయితీ, సమగ్ర వ్యక్తిత్వం, సత్ప్రవర్తన అలవరచుకోవాలని ఉద్బోధించారు. ఈ విద్యా సంస్థ లోక్ సభ మాజీ స్పీకరు శ్రీ మాడభూషి అనంతశయనం అయ్యంగారు జ్ఞాపకార్థం నెలకొల్పబడింది. శ్రీ ఎస్. వి. రావు ప్రత్యేక సంచికను ఆవిష్కరిస్తూ, శ్రీ అనంతశయనం అయ్యంగారు అధికారంకోసం ప్రాకులాడని యథార్థ గాంధీవాదని ప్రశంసించారు. ప్రిన్సిపల్ మంగమ్మ స్వాగతం చెప్పారు. ఇయాన్ గవేలరావు, మనోహర్ ప్రసంగించారు.

**ధరలు తగ్గించాలని ప్రదర్శనం :**

నిత్యావసర వస్తువులధరలు తగ్గించాలని, కరవు పరిస్థితి తొలగించడానికి తగుచర్యలు తీసుకోవాలని కోరుతూ అఖిలపక్ష సంఘం సెప్టెంబరు 20వ తేదీన అఖిలపక్ష సంఘం నగరంలో వూరేగింపు జరిపింది. ఈ వూరేగింపు కోటిగ్రౌండ్ (ఎరంజిమ్ఞో అడ్స్), నాంపల్లి, ఖైరతాబాద్‌ల మీదుగా రాజభవన్‌వరకు జరిగింది. వూరేగింపు తర్వాత వూరేగింపు ప్రతినిధులు గవర్నరుకు విజ్ఞాపన పత్రం సమర్పించారు. రాష్ట్రంలో 153 తాలూకాలను కరవు ప్రాంతంగా ప్రకటించాలని, ఎక్కువ చౌక దుకాణాలు తెరిచి, ఆహార ధాన్యాలను తక్కువ ధరకు అమ్మాలని విజ్ఞప్తిలో కోరారు.

**ఉపశ్రుతి :**

మద్రాసువిశ్వవిద్యాలయం వేదాంత విద్యార్థిని అమూల్యమాల్యద ఒక భయంకరోదంతం చెప్పింది. బస్సు వెళుతూంది విశ్వవిద్యాలయంవైపు. డ్రైవర్ నవ్వడం ప్రారంభించాడు విరగబడి. ఎందుకంత నవ్వు డ్రైవరుగారూ? అని ప్రశ్నించారు బస్సులోనివారు. కష్టాలువచ్చినప్పుడు నవ్వమని చెప్పాడు తిరువళ్ళువర్ — అన్నాడు డ్రైవరు. ఇప్పుడు మీకు వచ్చిన కష్టమేమిటి — అనడిగారు బస్సులోనివారు. బస్సుకు బ్రేకుల్లేవండీ — అన్నాడు డ్రైవరు.

**—తిరుమల రామచంద్ర**



# వారఫలం

**9-11-1979 శుక్రవారం మొదలు**
**15-11-1979 గురువారం వరకు**

**మేషం :** ఈ వారం మీకు కార్యభారం అధికం. అజమాయిషీ మీకు సంబంధించిన సంస్థలకు చేయటం కూడా భారమే. ముద్రణ, పత్రికాధిపతలకు, సామాన్య వ్యాపారం చేసేవారికి, కళాకారులకు, ప్రత్యేకంగా గాయకులకు, రాజకీయంగా శ్రమించే వారికి అనుకూలత గలదు. స్త్రీలకు :— ప్రత్యేకంగా నూతన వస్త్ర సేకరణ, అలంకారాలతో వారం గడచి పోతుంది. ఆదాయము గలవారం

**వృషభం :** సాంఘిక వ్యవహారాలలో, జోక్యం గల వారికి శ్రమాధిక్యత. కీర్తి ప్రతిష్ఠలకు ప్రాకులాట సహజమే. రాజకీయంగా ఈ వారం ఈ రాశికి అనుకూలత చెప్పవీలులేదు. క్రీడారంగానుభవం గలవారు, ఈ రాశివారు ప్రకాశిస్తారు. వారాంతానికి, ఉత్సాహం అతిశయిస్తుంది. అంటే క్రమంగా లాభదాయకఫలం చెప్పవీలులేదు కావలసిన గోచారం అనుకూలంగాక పోవటమే కారణం

**మిధునం** ఈ రాశివారు, నూతన కార్యక్రమాలకు ఉత్తమంగా ఉండగలదనీ, ద్రవ్యాదాయముంటుందని చెప్పవచ్చు. ఆగిపోయిన ప్రణాళికలుంటే, అమలు జరుపుటకు వారం అనుకూలం. ఉద్యోగరీత్యా, మీకన్న పెద్దలతో, అధికారులతో, అభిప్రాయభేదాలుంటాయేమో, జాగ్రత్తగా మెలగండి. స్త్రీలకు :— ఉద్యోగ వృత్తులలో సామాన్య ఫలమే చెప్పవచ్చు.

**కర్కాటకం :** చాలామందికి ఈ రాశివారికి ఉష్ణాధిక్యతచే ఆరోగ్యలోపం కలుగవచ్చు. వయసుమీరిన వారు జాగ్రత్తగా వ్యవహరించుట ఎంతైనా అవసరం. ఇంటిలో శుభకార్యాలోచనలుంటాయి. అందుకువలసిన ద్రవ్యం సమకూడే దినాలు చేరువగా నున్నట్లు గ్రహించాలి. లలితకళా ప్రావీణ్యత, చలనచిత్రరంగానుభవం గలవారు, విశ్వాతలు కృషిచేసి రాణింపుకు వస్తారు. స్త్రీలకు :— ఈవారం చాలమందికి కళాప్రీతి అతిశయిస్తుంది.

**సింహం :** మీ రాశిలో, గురు, శని, రాహు గ్రహాల కూటమి, ఏ పనికీ పోయి, చొరవ కలుగ చేయుచు ప్రతిభ రాణించే అవకాశం తక్కువ. పెద్దలతోగానీ, బంధువర్గీయులతోగాని, ముఖ్యంగా మిత్రులతోగానీ, వాదప్రతివాదాలు తగవు. బంధువులు యింటికి రావచ్చు. ముఖ్య సమస్యల విషయమై, అతి జాగరూకతతో మెలగుట ఎంతైనా అవసరం. స్త్రీలకు: అప్రయత్నంగా ఆదాయం, ఉద్యోగంలో అనుకూలత సంభవం.

**కన్య :** ఆరోగ్య విషయంలో, ఈ వారం జాగ్రత్త వహించాలి. అధిక వ్యయం సూచనలున్నాయి. ఆత్మీయులతో, మనస్పర్థలుంటాయేమో చూచుకోండి. మానసికంగా చికాకులుండవచ్చు దైవకార్యాచరణ సంభవం. ఉద్యోగంలో పొరపాటు జరుగవచ్చు, జాగ్రత్తగా సంచరించండి. స్త్రీలకు :— విలాసవస్తు, వస్త్ర సేకరణ, అందుకుకావలసిన అనుకూలత గల వారం.

**తుల :** వ్యాపారరీత్యా చాలమందికి, ఈ రాశి వారికి ఈవారం అనుకూలతగలదు. కృషిచేయండి, లాభాన్ని గడిస్తారు. ప్రభుత్వ సంస్థలలో ఉద్యోగం చేసే వారికి సర్వానుకూలత గలవారం. రాజకీయవాదులకు, వారఫలం ఉత్తమం. విశాఖ వారికి ఆర్థికాభివృద్ధి గలదు. స్త్రీలకు :— కుటుంబ సంతోషం, సుఖ శాంతులుంటాయి. ఆర్థికంగా బాగుండే వారమే.

**వృశ్చికం:** సంఘంలో మీ కృషికి ఉత్తమఫలం లభిస్తుంది. బంధువులతో శుభకార్యాలోచనలు చేస్తారు. క్రొత్తగా, యింటికి మిత్రులో, బంధువులో రావచ్చు. ఆదాయం గల వారం. రావలసిన డబ్బుకు గూర్చి ప్రయత్నించండి. గురువారం నాటికైనా కొంత అందవచ్చు. వ్యాపారం బాగుంటుంది. మీకు వ్యయం అధికమనే చెప్పాలి. స్త్రీలకు :— మాట పట్టింపులు, యిరుగుపొరుగు వారితో ఉండవచ్చు. శాంతంగా ఉండటం శ్రేయస్కరం.

**ధనుస్సు** పిత్రార్జిత ఆస్తిని గూర్చి కొన్ని చికాకులు తలయెత్తవచ్చు. మీ రాశికి, పై విషయంలో బంధువర్గంలో, చాలమంది వ్యతిరేకులుంటారు. ఆర్థికంగా సామాన్యఫలమే. ఆరోగ్య విషయంలో జాగ్రత్తవహించాలి సర్వసాధారణంగా మీరు అధిక కృషి చేస్తారు. నూతన వ్యాపారంమీద దృష్టి మరలుతుంది. స్త్రీలకు :— ఉద్యోగవృత్తులలో, ఆర్థికాదాయంలో, లాభసంపాదనలో వారఫలం ఉత్తమం.

**మకరం** ఆరోగ్య విషయంలో, చాలమంది జాగరూకత వహించవలసి ఉంటుంది. గ్రహజపం, శాంతి విధులు అనుసరించుట, ఎంతైనా మేలు రావలసిన డబ్బు చేతికందేవారం. అందుకుతగిన గ్రహానుకూలత, ప్రోత్సాహం గలవారం. అధికంగా వ్యయం సూచించే వారం. వృధా వ్యయం గాకుండా చూచుకోండి. అతి శుభప్రదమైన వర్తమానం మీకు అందవచ్చు. స్త్రీలకు :— వ్యయం అధికం, ఆదాయం సామాన్యం.

**కుంభం :** శతభిషా నక్షత్ర జాతకులకు, ఈ వారం సర్వరంగాలలో అభివృద్ధికలదు. ఆర్థికంగా అనుకూలత గలవారం. ఉద్యోగానుకూలత, అభివృద్ధి చెప్పవచ్చు. గౌరవ సంబంధమైన వ్యవహారాలలో జోక్యం కలుగజేసికొని, అభివృద్ధిని సాధించగలరు. రాజకీయ వ్యవహారాలలో జోక్యం గలవారు ప్రయత్నాలకు దిగవచ్చు. మిత్రసహకారం ఆశించవచ్చు. స్త్రీలకు :— బంధువర్గీయుల వలన లాభం.

**మీనం :** మీకు, తలవని తలంపుగా ఉత్తరాలు లాభదాయక విషయాలను గూర్చి వస్తాయి. చాలమందికి వ్యాపార రీత్యా లాభం చేకూరేవారం. అనుకోకుండా మరలా కోర్టు వ్యవహారాలు కొందరి విషయంలో తలఎత్తవచ్చు. రాజీమార్గమే సుఖదాయకం. స్త్రీలకు: ఆర్థికంగా బాగుంటుంది. సుఖశాంతులకు లోపంరాదు.

— విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి

## రచయితలకు మనవి

స్థానికంగా వున్న రచయితలు, కార్టూనిస్టులు కూడా మా కార్యాలయానికి వచ్చి వారి రచన లంద జేస్తున్నప్పుడు వాటితోపాటు స్వంత చిరునామా గల స్టాంపులంటించిన కవరు పెట్టడం అవసరం —సం.

## సామెతల కథ

### ఇంద్రభోగం

హాయిగా, వైభవంతో, ఉన్నవాడిని ఇంద్ర భోగం అనుభవిస్తున్నాడంటారు

ఇంద్రుడనేది ఒకరి పేరు గాదు. ఇంద్ర పదవిలో నున్నవారిని ఇంద్రుడంటారు, మంత్రిపదవిలో నున్నవారిని "మంత్రిగారు" అన్నట్లు. ఇతడు అష్టదిక్పాలురలో ఒకడు. నూరు కతువులు చేసినవాడు ఇంద్రపదవికి అర్హుడు తూర్పు దిక్కునకు అధిపతి — ఇంద్రలోకానికి అధిపతి ఐరావతమనే ఏనుగా, ఉచ్చైశ్శ్రవము గుర్రమూ, ఇంద్రుని వాహనాలు ఈ రెండూ పాలసముద్రం నుండి పుట్టినవే. వజ్రాయుధం యితడి ఆయుధం రంభా ఊర్వశీ, మేనకా, మొదలగు సుందరాంగులు, ఇంద్రలోకంలో ఇంద్రుడ్ని సంతోష పర్చటానికి, అతడి సమక్షమందు నాట్యమాడే దేవనాట్యకన్యలు. వారి నాట్యాన్ని తిలకిస్తూ, ఆనందంగా, హాయిగా, కాలం గడుపుతుంటాడు ఇంద్రుడు.

అలాగే ఎవ్వరైనా, గానా భజానాలతో సరదాగా, హాయిగ ఉంటే "ఏకేమిరా, ఇంద్ర భోగం అనుభవిస్తున్నావ్" అంటుంటాం. ఎగతాళిగా కూడా యీ పలుకుబడిని వాడుతుంటాం.

పద్మావతి గంగాధర్.

### ముక్తి - విముక్తి

సన్యాసి—
సర్వసంగ పరిత్యాగంచేసి
జడత్వపు నిద్రను విసర్జించి
వెతుకుతున్నాడు,
సంసారి -
సంసార సాగరాన్ని మధిస్తూ
చాలి చాలని బ్రతుకును
ఈదుతున్నాడు;
అతడి ఆరాటం ముక్తి కొరకు
ఇతని పోరాటం విముక్తి కొరకు

— న్యూట్రాన్

ఆంధ్ర సచిత్ర వారపత్రిక పరిశీలనార్థం పంపే బొమ్మలు, ముఖచిత్ర రచనలు పంపేవారు కూడా వాటితోపాటు తగినన్ని తపాలా బిళ్లలు అంటించిన కవరును జతపరచకపోతే అవి త్రిప్పి పంపబడవు. -సం.




ఆ సినిమా హాలు దగ్గర 'క్యూ' ఎరను మింగిన కొండచిలువలా వుంది. కదల లేక, కదలలేక కదులుతోంది.

మాధవ కూడా ఆ క్యూలో వున్నాడు. ఆదివారం కొత్త సినిమా మార్నింగ్ షో. మాధవ చుట్టూ చూసాడు. జనం తేనెటీగల్లా వున్నారు. ఎండ బంగారం రంగులో మెరిసిపోతోంది; "ఆదివారం యెంత ఆహ్లాదకరంగా వుంది." అనుకున్నాడు మాధవ. అంతలోనే అతని వూహను ఒక కుర్రాడు చిన్నాభిన్నం చేశాడు.

"బాబ్బాబు ... రెండు రోజుల నుండి అన్నం లేదు బాబూ! ఆకలితో చచ్చిపోతున్నాను, బాబూ! ధర్మం చేయండి." అని కాళ్ళా వేళ్ళా పడుతున్నాడా కుర్రాడు. ఆ క్యూలో మనుషులకి వాడి మాటలు యెవ్వరి చెవికి యెక్కటంలేదు. మాధవ వాడ్ని అప్రయత్నంగానే చూసాడు. చక్కని కుర్రాడు. తిండి లేక బలహీనంగా వున్నా వాడి కళ్ళలో కాంతి కనబడుతోంది. తిండి వుంటే యింకెంత బాగుంటాడో ననిపించింది. వాడు చిరిగిన నిక్కరు కట్టుకున్నాడు. కొత్త ఫ్యాషనలో దిగుతున్న పొట్టి చొక్కా లాటి చాలనిది వేసుకొన్నాడు. అది అక్కడక్కడా చిరిగేవుంది.

"అయ్యా! మీ కాళ్ళు పట్టుకుంటానండి. ధర్మం బాబూ!..." అంటూ కన్నీరు కారుస్తున్నాడు. వాడి రోదనం హృదయ విదారకంగా వుంది.

"ఒరే బాబూ! నీ చొక్కాకు అన్ని నోట్లున్నాయి. ఒక నోటు తీసి హోటల్లో భోంచేయరాదూ!" అన్నాడొక సూట్‌వాలా. 'క్యూ' ఘొల్లున నవ్వింది, మాధవ నొదిలేసి.

"యిదంతా ఆ 'షోర్' చిత్రంలో జయబాధురి ఆడుతున్న నాటకంలా ఆడుతున్నాడు" అన్నాడు. మళ్ళా ఆ సూట్ వాలా తన హిందీ సినిమా పరిజ్ఞానమంతా వెళ్ళబోసాడు జనం మధ్య. ఆ పిల్లాడి ముఖం చిన్నబోయింది.

"యిలా అడుక్కోవటం తెలుగు దేశంలో విపరీతమై పోయిందండి?"

"అహా! అలాగనకండి! అడుక్కోవటం కన్నా మంచి వ్యాపారం యింకోటి లేదు దీనికి వెల్త్ టాక్సు. సేల్సు టాక్సు, ఇన్‌కమ్ టాక్సుల వంటివిలేవు. పెట్టుబడి అంతకన్నా లేదు కడివెడు కన్నీళ్ళు చాలు యిలా బ్రతికి పోవడానికి."

"ఇలా అడుక్కుంటూనే దొంగ చాటుగా జేబులు కొట్టేస్తూంటారండి..."

"యిలాంటి వాళ్ళు సమాజంలో ఎంగిలాకుల్లాంటి వాళ్ళు."

'క్యూ'లో రకరకాల జీవితాలకు చెందిన కంఠస్వరాలు కోరస్ గీతాలు పాడుతున్నాయి, ఆ అడుక్కుంటున్న కుర్రవాడిమీద.

"యిలా శూలాల్లాంటి మాటలతో పొడవడం దేనికి వాడిని అటవికులకి, నాగరికులమయిన మనకీ మరి బేధం యేమిటి?" అనుకున్నాడు, మాధవ మనసులో జేబులో చిల్లర కోసం చేయి పెట్టి వెతుకుతూ— 'క్యూ' కొంచెం వేగం పుంజుకుంది. ఆ కుర్రవాడి ముఖంలో నిరాశా నిస్పృహలు కన్పించాయి మాధవకు.

"బాబూ!" కేక వేసాడు, మాధవ. వాడు దగ్గరకు వచ్చాడు.

"నీ పేరు" అడిగాడు.

"నా పేరు కిష్టయ్య బాబూ! దిక్కులేనోడ్ని" వాడి కళ్ళలో జలపాతాలు జారడానికి సిద్ధంగా వున్నాయి.

"యింద" అంటూ కొత్త రూపాయి బిళ్ళ తీసి వాడి చేతిలో వేసాడు జాలిగా. ఆ చేతులు చాలా లేతగా వున్నాయి. మురికిగా వున్నాయి. కొత్త రూపాయి కాసు వాడి మాసిన చేతిలో తళతళ మెరిసింది. ఆ మెరుపు వాడి వదనంలో ప్రతిబింబించింది. 'క్యూ'లో వాళ్ళందరూ మాధవను వింతగా చూసారు.

"బయల్దేరేదండి దానికన్నాడు. వీడి కొక్కడికే డబ్బు వున్నట్టు."

"ఆఁ బాగా... బ్లాక్ మనీ పుణది కాబోలు. యేం చేస్తాడు."

"కొంతమంది యిల్లా మందిలో ఫోజు కొట్టడం అలవాటు."

"యిలాంటి వాళ్ళే ఆంధ్రదేశంలో దివ్య గాళ్ళని బికారేట్ చేసి అభివృద్ధి చేస్తున్నారు."

మళ్ళా ఆవే శంఠస్వరాల గుసగుసల వ్యాగ తాలు పొడుకుంటున్నాయి. ఆ కుర్రాడు కృతజ్ఞతా పూర్వకంగా మాధవకు దండం పెట్టి పరుగులాంటి నడకతో వెళ్ళిపోయాడు.

సినిమా చూస్తున్నంతసేపు మాధవకి

# ఎవరిదీ నేరం?

అడుక్కుంటున్న కుర్రాడు, వాడి భవిష్యత్తు యివే కళ్ళముందు నిలిచాయి. చివరకు వాడు యెలా తయారవుతాడు? యే దొంగగానో, బందిపోటుగానో, హంతకుడిగానో... యేమో...యేమో. యెలా తయారవుతాడో. దీనికి బాధ్యులు యెవరు? ఈ పసి వయస్సులో వాడి బ్రతుకును అలా తయారు చేసిందెవరు! వాడు ఆరోగ్యకరంగా బ్రతకాల్సిన పరిస్థితులు కల్పించటంలో సమాజం యెందుకు బాధ్యతల్ని విస్మరించి హేళన చేస్తోంది. దీనికి పరిష్కారం యేమిటి?

సినిమా కన్నా శరవేగంగా ఆలోచనల తరంగాలు అతని మస్తిష్కంలో పరిభ్రమించాయి.

భారమైన గుండెలతోనే సినిమా అవగానే లేచాడు. మధ్యాహ్నం యెండ నిప్పులు చెరుగుతోంది. ఆకలి గూడా వేస్తోంది. బ్రహ్మచారి మాధవకు ఒంటరి బ్రతుకు మీద చాలా కోపం వచ్చింది. కొయ్యల్లా వుండే హోటలు మెతుకులు తినాలి. అన్నం గూడా చల్లారిపోయి వుంటుంది. ఆకలి అతని నడకను తొందరచేసింది. అంత తొందరా, రోడ్డు పక్క లోయలో వున్న మర్రిచెట్టు దగ్గరకు వచ్చేసరికి ఆగిపోయాయి. ఆ మర్రిచెట్టు క్రింద చిన్న కొట్లాట జరుగుతోంది. నలుగురైదుగురు పిల్లలు కలిసి చితకబాదేస్తున్నారో కుర్రవాడిని.

మధ్యలో మాధవ వెళ్ళి కలుగజేసుకుని విడదీశాడు. వాళ్ళంతా మురికితో అసహ్యంగా వున్నారు. కొందరు జిడ్డోడుతూ దరిద్ర దేవత కని పారేసి విసిరేసిన పిల్లల్లా వున్నారు. అందరి ముఖాల్లోను కోపం విపరీతంగా కన్పించుతోంది. వాళ్ళందరి మధ్య నొక కుర్రాడు ముడుచుకుపోయి కూర్చున్నాడు. వాడి చొక్కా పీలికలుగా చిరిగిపోయింది.

"యెందుకురా... అలా... వాడ్ని తన్నారు?" అడిగాడు మాధవ.

"మేమంతా బొమ్మా బొరుసా ఆడుకుంటున్నాం. వీడు డబ్బులు ఓడిపోయాడు; మాకు బాకీపడి పోయాడు. ప్రతిసారి వీడికి అలవాటయి పోయింది" అంటూ బెదురుతూ చెప్పాడో కుర్రవాడు, మధ్యన.

"అందుకని మీకన్నా చిన్నవాడ్ని చితకబాదుతారా?" కోపంగా అడిగాడు. వాళ్ళు బెదిరిపోయి చల్లగా జారుకున్నారు; వాడు మాత్రం వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు.

"ఛీ! బాబూ! యేడవకు; యింకెప్పుడు వాళ్ళతో ఆడకు. యిందా యీ పావలా పెట్టి యేమైనా కొనుక్కో..." అంటూ భుజంమీద తట్టి యివ్వబోయాడు. తటాలున మాధవకు యేదో గుర్తుకు వచ్చింది. ఆ చొక్కా చిరిగిపోయిన పొట్టి చొక్కా యెక్కడో చూసినట్టుగా అనిపించింది. యేడుస్తున్న వాడి ముఖం పైకెత్తి చూసాడు... ఆశ్చర్యం. ఉదయం సినిమా దగ్గర అడుక్కున్న కిష్టయ్య; వాడి ముక్కు నుండి రక్తం వెచ్చగా కారుతోంది. ముఖానికి మన్నంటుకుంది.

"అరె! నువ్వెందాకా..." మాధవ సగం మాటల్లోనే అతని చేతిలో పావలా కాసు తీసుకొని కిష్టయ్య శరవేగంతో పరిగెత్తి రోడ్డు దాటి పోయాడు.

నవ్వుకున్నాడు మాధవ, భోజనానికి దారి తీస్తూ.

* * *

"ఈ ఆదివారం బాగా పాలన చేసినట్టున్నావ్, నీ గర్ల్ ఫ్రెండ్స్" అన్నాడు మోహన్ అప్పుడే బట్టలు మార్చుకుంటున్న మాధవను చూసి. రాత్రి తొమ్మిది గంటలు దాటింది. నవ్వేశాడు మాధవ. ఉదయం జరిగిన సంఘటన చెప్పాడు.

### భూగర్భం నుండి విద్యుచ్ఛక్తి

భూమిలోగల వేడరాతి ఫలకాల పై చల్లని నీటిని ప్రవహింపచేసి, దీని ద్వారా విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేసే పద్ధతిని కనుగొన్నట్టుగా, జపాను అంతర్జాతీయ వాణిజ్య మంత్రిత్వ శాఖ ప్రకటించింది. ఈ విధానం అగ్నిపర్వతాలు ఎక్కువగా కల ప్రదేశాలలో చాలా సులభం. దీని ద్వారా డెబ్బై మిలియన్ కిలో వాట్ల విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేయవచ్చును. దీని ప్రదర్శనకు 1982 వ సంవత్సరంలో మెక్సికోలో ఒక "ఆర్టిఫిషియల్ హీట్ వెల్" నిర్మించనున్నారు.






# ఎల్లప్పుడు చైతన్యంగా
# ఎల్లప్పుడు చురుకుగా

మీ బాబు పెరుగుతున్నప్పుడు, అతను నిరంతరం అధికంగా శక్తి వినియోగిస్తూ ఉంటాడు.

మీ బాబుకు శక్తినిచ్చే రుచికరమైన, బాగా తయారైన మాల్ట్ చాకొలెట్ పానీయం బూస్ట్. ఎందుచేతనంటే బూస్ట్, సంపూర్ణమైన మీగడ పాలు, గోధుమ, బార్లీ మాల్ట్ మరియు కొకో తయారైనది.

మీ బిడ్డకు శక్తినిచ్చే ఈ ఇంధనాన్ని ఇవ్వండి. అది అతను రోజంతా, ప్రతీ రోజు కూడా చురుగ్గా, చైతన్యవంతంగా ఉండేటట్టు చేస్తుంది




## చురుకైన జీవనానికి శక్తినిచ్చే ఇంధనం

## బూస్ట్
మాల్ట్ చాకొలెట్ మిల్క్ డ్రింక్

## ధర్మపథం

# ఆహారపు విలువ

– బులుసు వెంకట రమణయ్య

దేశంలో కరువు, కాటకాలు సంభవించి, ప్రజలు ఆహారానికి చాలా శ్రమలు పాలవుతూ వుండడం, ధరలు పెరిగి పోవడం వల్ల మధ్య తరగతి జనుల జీవనం ఆందోళనకరంగా ఉండడం మనం ఎరుగనిది కాదు. ఒకవైపు ఇలా వున్నా, మరొకవైపు శ్రీమంతులు వివాహాదుల్లోనూ, విందుల్లోనూ అనవసరంగా ఎంతో ఆహారం వ్యయం చేస్తున్నారు. ఆయా సందర్భాలలో కడుపునిండా తిండి ఉన్నవారికే ఆహ్వానాలు అందుతాయి. మర్యాద కోసం వారు ఆయా విందులకు హాజరయి సగం తిని, సగం పారవేస్తారు. ఎంత అంటారో అంత కుప్పతొట్టిలో పడుతుంది. ఇలా ఆహారం వ్యర్థం కావడం– ఆహారపు విలువ తెలిసే వారికే బాధ కలిగిస్తుంది.

తిరువళ్ళువరు పేరు మీరు వినే ఉంటారు. ఆయన త్రివర్గ ప్రతిపాదకమైన తిరుక్కురళ్‌ను రచించారు. వేమన చెప్పిన విధంగానే అది చిన్నచిన్న నీతులు తెలియజేస్తుంది. ఆయన వేమన వలె యోగి. నిరీహుడు. ఎవరయినా పిలిచి, అన్నం పెడితే తినేవాడు. లేకపోతే లేదు. అతడు తన్ను ఆహ్వానించే వారి యింటికి వెళ్ళేటప్పుడు ఒక చిన్న గిన్నెతో నీళ్ళూ, ఒక సూది తీసుకుని వెళ్ళేవాడట! ఇది అందరికీ ఆశ్చర్యాన్ని కలిగించేది.

ఒకప్పుడొక గృహస్థు ఇతని కాతిథ్యం యిస్తూ, ఆ చిన్న పాత్రలో నీళ్ళూ, సూదీ తీసుకు రావడంలో ఉద్దేశ మేమిటని తిరువళ్ళువరును ప్రశ్నించాడు.

"నాకు మీరు పెట్టే ఆహారాన్ని తినేటప్పుడు అన్నపు మెతుకులు, కూర ముక్కలు మున్నగునవి భోజన పాత్రం నుంచి కింద పడిపోవచ్చు. అలా పడిపోవడం సహజం. అప్పుడు నేను సూదితో వాటిని తీసి, పాత్రలో వడవేసి, నీటితో శుద్ధి చేసి, స్వీకరిస్తాను. ఆహార పదార్థాలలో ఏ మాత్రం వ్యర్థమయినా నాకు చాలా బాధగా ఉంటుంది" అని వళ్ళువరు సమాధాన మిచ్చారట!

ఆహారం యొక్క విలువ తెలిసినవారు ఎవ్వరూ ఏ స్వల్పం కూడా వ్యర్థం చేయరు. అన్నం పరబ్రహ్మ స్వరూపమని మనవారంటారు. పరబ్రహ్మను ఎంత భక్తి గౌరవాలతో చూడాలో, అన్నాన్ని కూడా అంత శ్రద్ధతో గమనించాలి. కొందరు భోజనం చేశాక చూస్తే వారి విస్తళ్ళు చిందర వందరగా ఉన్న ఆహార వస్తువులతో ఉంటాయి. అలా తినే వారిని ఇతరులు ఏవగించుకుంటారు. ఆహార వస్తువులు వడ్డించడానికి ముందు విస్తరి ఎలా వుంటుందో, భోజనానంతరం కూడా ఆ రీతిగా ఉండాలని– అంటే– అంత నిర్మలంగా ఉండాలని అంటారు. ఆహారపు విలువ తెలిసినవారే ఆ రీతిగా భుజిస్తారు.

పదార్థాలు అలక్ష్యంగా పాడుచేయడం వల్లనూ, ఆహార పదార్థ శాఖవారి అశ్రద్ధ వల్లనూ మాత్రమే మనకు ఆహార వస్తువుల కొరత ఏర్పడుతుంది.

# ఎవరిదీ నేరం?

"ఒరేయ్! నువ్వు పూర్వ జన్మలో శిబి చక్రవర్తో, బలిచక్రవర్తో, బుద్ధుడో, దానకర్ణుడో అయి వుండాలి. మనం యెంత ఉద్యోగాలు చేసి సంపాదించుకున్నా, దానానికి, ధర్మానికి అర్హత వున్నవాళ్ళకే వేయాలి. లేకపోతే..." మోహన్ ఈ డైలాగు మొదటిసారి కాదు.

"పోనీలేరా! యెవరి పాపం వాళ్ళది" అని సర్దడానికి ప్రయత్నించాడు మాధవ.

"అన్నట్లు చెప్పటం మరిచాను. రేపు పొద్దునే రైల్వే స్టేషనుకు వెళ్ళాలి. ఉదయం నీ చేతి కాఫీ త్రాగాలి. పాల బూత్ దగ్గరకు వెళ్ళాలి ట్రైన్ మిస్సవుతుంది రేపు డ్యూటీ నీది" అన్నాడు నవ్వుతూ.

"ఓ! అలాగే!" అన్నాడు మాధవ హుషారుగా.

"అలాగే అంటే సరికాదు. నిన్ను పంపించటం అంటే నాకు భయం వేస్తోంది. రెండు లీటర్ల పాలకు బదులు యెన్ని తెస్తావో నీకే తెలియదు. అక్కడ మళ్ళా యే బిచ్చగాడో తయారవుతాడు, నీ దానధర్మాలు అందుకోవడానికి" అన్నాడు మోహన్ కొంచెం వేళాకోళంగా.

"ఈసారి అలాంటిదేదీ జరగదులే!" అని హామీ యిచ్చాడు మాధవ.

ఒకసారి యేంజరిగిందంటే; వాళ్ళుండే అఫీషియల్ కాలనీ ఊరికి కొంచెందూరంగా వుంది. యింకా అక్కడ కాఫీ దేవాలయం ప్రారంభం కాలేదు. కనీసం వొక మైలు దూరం వెడితే గని కాఫీ దేవాలయం రాదు. అందువలన వాళ్ళకి యింట్లోనే కాఫీ తయారు చేసుకోక తప్పలేదు. తెల్లవారు ఝామున పాలబూత్ దగ్గరకు వెడితే గనీ పాలు దొరకవు. ఉదయం కాఫీ పోర్టుఫోలియో మోహన్‌దే. కానీ ఆ రోజుమాత్రం మోహన్‌కు ఇనస్పెక్షన్. తొందరగా వెళ్ళాల్సిన పని వుండటంవల్ల మాధవ పాలబూత్ దగ్గరకు వెళ్ళాల్సి వచ్చింది. నిద్ర కళ్ళతోనే పాలు తీసుకుని తిరిగి వచ్చేసరికి అరగంట గడిచింది. పాలు టేబిలు మీద పెట్టేసి బాత్‌రూమ్‌లోకి దూరాడు మాధవ.

"యేరా పాలెక్కడయినా నిద్రకళ్ళతోనే వొంపేసావా? రెండు లీటర్లకో అర లీటరు పాలె తెచ్చావ్! లేక పాలమ్మాయి యివ్వలేదా?" అరుస్తున్నాడు మోహన్.

"లేదురా! అక్కడేం జరిగిందో. యెవరో వొక నడివయస్సు వ్యక్తి చాలా దీనంగా ముఖంపెట్టి అభిమానంతో అడుగుతున్నాడు.

"సార్, ట్రెయిన్‌లో వస్తున్నప్పుడు నా పర్సు యెవరో కొట్టేసారండి. మా వూరు చేరుకుందికి బస్సు టిక్కెట్టుకు డబ్బులేదు. దయవుంచి కొంచెం హెల్పు చెయ్యండి సార్!" అని దీనంగా అడుగుతుంటే కాదనలేక లీటరున్నర డబ్బు లాతనికిచ్చాను యేంచేస్తాం పాపం ఆపదలో వున్నాడు" అన్నాడు మాధవ.

"ఒరేయ్! వాడూరికి బస్సు మీద చేరుకోడురా! నువ్విచ్చిన డబ్బుతో వాడు

యీ సారా దుకాణంకో, చిట్స్ పేకక్లో, బ్రాకెట్టాటకో చేరుకుంటాడు. విన్ని పంపడం నాదే బుద్ధి తక్కువ" అన్నాడు మోహన్ ముఖం వెలిగిస్తూ.

పాత సంఘటన గుర్తుకు వస్తే చిన్నగా నవ్వుకుని నిద్రలోకి జారుకున్నాడు. తిరిగి లేచేసరికి యింకా మంచుతెర ప్రకృతిని విడవలేదు. నిద్రకళ్ళతోనే తొందరగా లేచి పాలబూత్ వేపు పరిగెత్తాడు. యేమాత్రం ఆలస్యం జరిగినా పాలుండవు. అప్పటికే కొండచీటి చాంతాడులా వుందా 'క్యూ'. చివర్న నిలబడ్డాడు మాధవ. ఒక ఆర్త నాదం వినబడింది ముందున మాధవకు.

"యింకా తెల్లవారలేదు. యాచన ప్రారంభం అయిందండీ" అంటున్నారెవరో ముందువాళ్ళు.

"దేశంలో అన్నిటికి ముహూర్తాలు, రాహుకాలాలు, వర్జ్యాలు, శుభ్రాలు వున్నాయండీ. కానీ అడుక్కోవటానికి మాత్రం.. కాలనియమం యే ధర్మ శాస్త్రంలోనూ, యే కాన్‌స్టిట్యూషన్‌లోనూ మనవాళ్ళు రాయలేదండి..." క్యూలో అంతటా నవ్వులు.

"అయ్యా! దొరా! ధర్మంగల బాబా! మా కుర్రోడు నిన్నట్నుంచీ మూసిన కన్ను తెరవలేదండి. యిస జ్వరమండీ. డాటరు బాబు మందు వేయమన్నాడండీ. బాబూ ధర్మం చేసి కుర్రోణ్ణి బతికించండి. మీకు పుణ్యముంటుంది" అంటూ చేతిలో ఒక చీటీ చూపిస్తోంది, హృదయవిదారకంగా దుఃఖిస్తూ. ఆ చీటీని యెవ్వరూ చూడటం లేదు. ఒకరు కసురుకుంటూ వుంటే ఇంకొకరు, యువతల తలను అవతలివేపు తిప్పుతున్నారు.

"బాబా ధర్మం చేయండి. నా కుర్రోడి పేణాలు మీ చేతిలో వున్నాయయ్యా. తలా మీకు తోచిన చిల్లర దానం చెయ్యండయ్యా. మీరిచ్చిన డబ్బుతో యీ సిటీలో మందు కొంటానయ్యా. మీ కాళ్ళకు మొక్కుతా నయ్యా! నా బిడ్డణ్ణి బతికించు కుంటా నయ్యా" దీనంగా యేడుస్తోంది. ఆమె చేతిలో చిల్లర డబ్బులు ఆ మంచులో మసక మసకగా కన్పిస్తున్నాయి. అప్రయత్నంగానే మాధవ జేబులోకి చెయ్యి వెళ్ళింది. అయితే అక్కడే ఆగిపోయింది. ఆరోజు వుదయం తను దానం చేసిన



శాంతి నోబెల్ బహుమతి పొందిన మదర్ థెరెసా

కిష్టయ్యా! వాడి యేడుపు... బొమ్మ బొరుసూ ఆట, మోహన్ చెప్పేసాడున్నయీ జ్ఞాపకం... వచ్చాయి. అతని జాలి, ఆ సరిహద్దుల్ని దాటలేక పోయింది.

"యమగోల సినిమా తీసారుగానీ సినిమా వాళ్ళు బిచ్చగాళ్ళగోల అని తీస్తే బాగుండేది." యెవరో నవ్వారు, ఆ జోకుకు మంచుతెరల మధ్య.

"యేమిటమ్మా! యింకా తెల్లవారలేదు: నీ గోల... వెళ్ళు... వెళ్ళు..." యింకో ఆసామీ కసురుకున్నాడు. ఆమె యింకొకరి దగ్గర చేయి చాపింది.

"వెళ్ళవమ్మా బుద్ధిలేదు ... వెళతావా పోలీసుల్ని పిలవమంటావా ?" అని బెదిరించాడు మాధవ ముందునున్న వ్యక్తి.

ఆమె అందరి వంక వెర్రి చూపులు చూస్తూ కళ్ళు వొత్తుకుంటూ, వెళ్ళిపోయింది. మాధవ భారంగా నిట్టూర్చి పాలు తీసుకుని వచ్చేసాడు.

ఉదయం పది దాటిపోయింది. మాధవ ఆదరా బాదరాగా హోటల్లో భోజనం చేసి బయల్దేరాడు. అప్రయత్నంగానే మర్రిచెట్టు వంక చూసాడు. అక్కడే బస్సు స్టాపు. బస్సెక్కి ఆఫీసు కెళ్ళాలి. మర్రి చెట్టు దగ్గర జనం గుమిగూడి వున్నారు. మాధవ కాళ్ళు అటువేపు దారి తీసాయి. ఆ జనాన్ని కొంచెం తప్పించుకొని దారి చేసుకొని చూసాడు.

"బాబూ! లేవరా!... నన్ను...ఒంటరి దాన్ని చేసి వెళ్ళిపోయావా? బాబూ..." అంటూ ఆ శవం మీదపడి బోరున విలపిస్తోంది. తైల సంస్కారం లేని ఆమె ముంగురులు ఆ శవం ముఖాన్ని ఆక్రమించేసాయి. ఆ కంఠస్వరం గుర్తుపట్టాడు మాధవ. ఆమె యెవరో కాదు, తెల్లవారుఝామున పాలబూత్ దగ్గర అడుక్కోవడానికి వచ్చిన స్త్రీ. యెవరోదారుస్తారామెను. యెలా సానుభూతి యెవరి మండలభిస్తుంది ఆ క్షత దుఃఖిత మాతృహృదయానికి...?

మాధవకు కాళ్ళు నిలవటంలేదు. అక్కడ నిలబడలేక పోతున్నాడు. ఉదయం వొక పది పైసలు వేసివుంటే మిగిలిన జనంలో కొంతమంది అయినా ధర్మం వేసి వుండేవారేమో! 'భగవాన్ యెంతపని చేసావు' అనుకున్నాడతను. ఆమె కళ్ళలో కన్నీరు అయిపోయిందేమో, వొకసారి తల యెత్తింది. ఆమె కంటినిండా చారికలు కన్పిస్తున్నాయి. పీలగా గాలివేస్తే యెగిరి పోయేటట్టుగా చిరిగిన గుడ్డలతో మూసిన చీరతో వుందామె అచేతనంగా.

అప్రయత్నంగానే శవం వేపు చూసాడు మాధవ.

అంతే! యెవరో బలంకొద్దీ చేతిలో రాయి తల మీదకు గురిచూసి విసిరినట్లయింది. అతని తల గిర్రున తిరిగింది. ఆ చనిపోయిన కుర్రవాడు కిష్టయ్య!

బస్సులో కూర్చున్న మాధవకు స్పీడుగా పోతున్న బస్సు చక్రాలతో పాటు 'యెవరిదీ నేరం...యెవరిదీ నేరం...?' అన్న ప్రశ్నలు అతని మనస్సులోని మానవత్వాన్ని విలదీసి అడుగుతున్నట్లుగా గమ్యస్థానం చేరుకోవాల్సిన బస్సు భూమిని చీల్చుకొని, భూగర్భంలోకి చొచ్చుకు పోతున్నట్లుగా అనిపించింది మాధవకు.

## స్టార్ వాల్యూ !

ఇంగ్లండుకు చెందిన ఆండ్రెగ్రే అనే ఫుట్‌బాల్ ఆటగాణ్ణి సంవత్సరానికి ముప్పయిలక్షల రూపాయలిచ్చి హెవ్స్టన్ నగరానికి చెందిన వో ఫుట్‌బాల్ క్లబ్ తమ ఆటగాడిగా నియోగించుకున్నారట. అతగాడి వయస్సు 23 సంవత్సరాలట!

## చూస్తేకాని తెలియనిది !

చంద్రునిలో వో రాత్రి అనే మళయాళ సినిమాలో సెన్సారయిన సీనులు కూడా చేర్చి చూపిస్తున్నారని మద్రాసులో వో థియేటరులో ఆడే సినిమాని పోలీసులు ఆపి, కోర్టులో ఫిర్యాదుచేస్తే మాజి స్ట్రేటుగారు నేరుగా ఆ సినిమా వేయించుకుని చూసి, మరే, ఉద్రేకపరిచే, అభ్యంతరమైన సీనులు బోలెడు న్నాయి సినిమా లోఅన్నారట. పోన్లెండి, ఆయన చూశారు కదా!

* * *

సేలం ఫాతిమా కాన్వెంటుకు చెందిన విద్యార్థినులను ఆ కాన్వెంటు ఉల్లాస యాత్రకుతీసుకు



వెళ్ళిందట. యాత్రంతా ముగించి స్వదేశం చేరుకుని బస్సులో సేలం వస్తూండగా వృధాచలం ప్రాంతంలో బస్సు బ్రేకులు పోయాయట. దాంతో డ్రయివరు ఎవరిశక్తికొద్దీ వారిని దూకి పారిపొమ్మన్నాడట. ఆ పని చాలామంది చేసి, చిన్నచిన్న పెద్దపెద్ద దెబ్బలతో చాలామంది బయటపడ్డారట. సెల్వి అనే 15 ఏళ్ళ పిల్ల బస్సులోంచి దూకేసరికి బస్సు అదే సమయంలో ఆమెమీద తిరగబడి ఆమెపచ్చడై, చనిపోయిందట.

## ఇండోనీసియాలో రెక్కల మొసలి ?

ఇంగ్లీషు సినిమాలలో చూపించే డ్రాగన్ అనే మృగసంతతే భూమిమ్మీదలేదనీ, దాని జాతి సంపూర్ణంగా నాశనమయిపోయిందనీ మొన్న మొన్న దాకా కొందరనేవారనీ, కానీ యిది ఇండోనీషియా దీవులలో వున్నదని చూచినవారన్నారట. ఈ భయంకర మృగం 12 అడుగుల పొడవు, 300 కిలోల బరువు వుంటుందట. చూడ్డానికి మొసలి ఆకారంలో వుండే యీమృగం కోతులను, లేళ్ళను, పందులను, భక్షించే యగలదట. మనిషి కనిపిస్తే పిప్పరమెంటు నమిలినట్టు నమిలేస్తుందట. ఇండోనీషియాకు చెందిన టోమోటో అనే దీవిలో యివి చాలా ఎక్కువగా వున్నాయట.

## మూగదైపోయిన గడియారం !

లండనులోని బిగ్‌బెన్ గడియారం అప్పుడు 1858 నుంచి నేటివరకూ కాలాని ఎంచక్కా చూపిస్తూనే వుందట. 1976 లో మొట్టమొదటిసారి రిపేరు కోరినపుడు నగరవాసులంతా పిచ్చెక్కినట్టయిపోయారట. తిరిగి 1978 లో వో చిన్న రిపేరొచ్చిందట. మళ్ళీబాగా తిరుగుతున్న యీ గడియారం మొన్న సెప్టెంబరు పదిహేనోతేదీ ఉదయం పదకొండు గంటలుచూపించి, గంటలు మాత్రంకొట్టలేదట. మిగతా అన్ని గంటలూ సరిగ్గా కొట్టిందట. ఏమిటీని భావమని లండనేయులాశ్చర్య పడుతున్నారట.

## "అక్రమశిక్షణ" ఫలితం !

జాపానుకు చెందిన వో అయిదేళ్ళ కుర్రాడిని వాళ్ళ నాన్న రోజూ పడుకోబోయేముందు ఏదో ఒక వంకతో చితకబాదుతూవుండేవాడట. ఈబాధపడలేక ఆకుర్రాడు తమ నివాసం అయిదో అంతస్తు నుంచి దూకి ఆత్మహత్య చేసుకోబోయి, కాసిన్ని దెబ్బలతో బ్రతికిపోయి చేరాడట. ఏమిరాయిది అంటే విషయం చెప్పాడట. డిసిప్లిన్ పేర పిల్లల్ని రాచిరంపాడ తినే తలిదండ్రులకిదో గుణపాఠమగుగాక !

## మంత్రాల పెళ్ళికోసం...

సెన్సోసాయోసి అనే జపాన్ దేశపు యువకుడు తాను హిందూధర్మ శాస్త్రప్రకారం పెళ్ళిచేసుకోవాలని తీర్మానించుకుని, తన ప్రేయసి మవుకమికి యీ విషయం చెప్పి, ఒప్పించి యిద్దరూ కలసి 4149 మైళ్ళు ఎగురుకుంటూ [విమానంలో] ఢిల్లీవచ్చి, అశోకాహోటలులో మన సాంప్రదాయం ప్రకారం ఆడంబరంగా పెళ్ళి చేసేసుకున్నారట.

## సూటు రిక్షావాలా !

ఢిల్లీలో వో ధనిక కుటుంబానికి చెందిన అతుల్ కుమార్‌గుప్తా తనతలిదండ్రులు చనిపోవడం తన అన్నగారికీ, తనకీ పొత్తు కుదరకపోవడంతో వో అయిదు వేల రూపాయలు తీసుకుని బ్రతుకు తెరువుకోసం కలకత్తా చేరితే, అక్కడ ఎవరో ఆ డబ్బు కాస్తా కాజేశారట. దాంత అతడు చేతిరిక్షా లాగుతూ జీవనం ఆరంభించాడట. ఆతడిమీద పోలీసులు యిటీవల చేసుకున్న ఫలితంగా 65 వేల రిక్షాలున్న ఆవూళ్ళో రిక్షా వారి యూనియనుకు అతను ప్రెసిడెంటు అయ్యాడట. ప్యాంటులో షర్టు టక్‌చేసుకుని యీతడు రిక్షా లాగుతాడట. డిగ్నిటీ ఆఫ్ లేబర్ !




Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna.

# THE INSTITUTE OF ENGLISH STUDIES

మొదటి మెయిన్‌రోడ్డు, లేక్ ఏరియా,
600 034
(వళ్లువరుకోటము ప్రక్కన)

## "ఆంగ్లము స్వర్గద్వారము"

మరణము (Death), ఉన్నతులు-అధములు (The high and low). చిన్నవారు-పెద్దవారు (The young and the old) అను ఏ విధమైన వ్యత్యాసమును చూడకుండ ఎవరినైననూ ఏ సమయములోను తన వల్లని చేతులలో ఇముడ్చుకొనును. దాని పిదప, వారి పుణ్య పాప కృత్యములకు తగినట్లు "స్వర్గము, నరకము" మొదలగు స్థలములకు గొనిపోబడుదురని తలంచుచున్నారు.

స్వర్గము : పలురకపు ఫల వృక్షములు (Orchards) ప్రశ్నించువారు లేక విరివిగా పడియుండు స్థలము. కంటికింపైన నందన వనములు (Colourful flower gardens) స్వచ్ఛమైన సెలయేళ్ళు (Streams), ఇటువంటి వానితో ఒక ఇంద్ర సభ. అచట రంభ, తిలోత్తమ, ఊర్వశి అనెడు నాట్య సుందరాంగులు ఉండెదరు. సోమపానము (అతి మత్తునెక్కించు మధుపానము - Highly intoxicating liquor) త్రాగుచూ, వారి నాట్యమును చూచి ఆనందించవచ్చునట. నిజముగా ఇట్లే స్వర్గముండుననిన చో నేను మరణించిన పిదప నాకు స్వర్గము వలదు.

నరకము : చిత్రవధ చేయబడు స్థలము. పాపాత్ముని ఒకనిని విష సర్పములు కాటు వేయుచునే ఉండును. మరొకనిని ఘోరాగ్నిలో కాల్చుచునే యుందురు. ఇంకొకని కంఠమును కత్తితో కోయుచునే యుందురు. ఇలవాటు పడినచో, ఇది చిత్రవధలుగానే తోచవు. ఇదియే నరకమనినచో ఈ భూలోకమున కంటెను నరకమే ఎంతో మేలై నదగుచున్నది. ఈ భూలోకములో పాము ఒకసారి కాటేసిననే మనిషి లేడు. ఒకసారి అగ్నిలో వేసిన మసియై నాశనమగుచున్నాడు. కోసిన పిదప మరల కోయుటకు కంఠము ఉండునా?

స్వర్గమును, నరకమును గురించి ఇటులంతయు వాగుచున్నారే! "ఇటులనే ఉన్నవి. నేను చూచితిని" అని ఎవరైననూ గుండెపై చేయివేసి చెప్పనిమ్ము చూచెదము.

పుణ్యకార్యమునకు సన్మానింపబడువారిని, పాప కార్యమునకు తగిన శిక్షననుభవించువారిని ఈ లోకములోనే కనులారా కాంచుచున్నాము. ఆటులుండగా అపరిచిత స్థలములకు కొనిపోయే ఈ కార్యములను చేసి తీరవలెనను స్థితి భగవంతునికి లేదనుట తేటతెల్లము.

ఆలోచనను పురికొల్పునట్లుగా, ఏదైన చెప్పిన ప్రజలు వాటిని ఒప్పుకొన భీతిల్లెదరు. కావున దేశమునందు ప్రబలిన భావములను "భక్తి" అను ముసుగులో, సినిమా, కాలక్షేపమువంటి వానిద్వారా వ్యాపింపజేసిన ప్రజలు స్వాగతము పలికెదరు. వారినుండి డబ్బు గుంజి ధనవంతులు కావచ్చును. కావుననే, "సూది చెవిలో ఒంటెయు దూరవచ్చును. కాని, ధనవంతులకు స్వర్గములో స్థలములేదు" అను భావము స్థిరపడినది. (Biblical saying preaching socialism).

ఈ సందర్భములో ప్రాజ్ఞులు కొందరి జీవిత చరిత్రల నుండి (Biographies) ఒకటి, రెండు సంఘటనలను జ్ఞప్తికి తెచ్చుకొనుచున్నాను:

"గ్రీకురాజు యుల్లీసిస్, నా ఆయువు ఇంకను ఒక నిమిషమే అనిన ఆ ఒక నిమిషములో ఏమి క్రొత్తగా తెలిసికొన వీలగునో దానిని తెలిసికొన ప్రయత్నించెదను, అనెను. భారతదేశపు వాస్తుశాస్త్రవేత్త, డాక్టరు విశ్వేశ్వరయ్య తన 101-వ వయస్సులో, మరణించు సమయములో అంగ్లములో, అపుడు క్రొత్తగా అంగీకరించబడిన పదములలో తన ఏకాగ్రతను నిలిపెనట".

కావున, తెలివికి, ఆలోచనకు ఎచట స్థలమున్నదో, ఆ స్థలమునే, నేను, "స్వర్గము" అని అభిప్రాయపడెదను. ఆంగ్లభాష తనలో సకలశాస్త్ర గ్రంథములను కలిగియుండుటచే సంపూర్ణమైన ఆంగ్లభాషా జ్ఞానము, తెలివిని పెంపొందించుటతో, చక్కని ఆలోచనకు దారి తీయును.

కావున, ఆంగ్లము "స్వర్గద్వారము".

G. SHANMUGASUNDARAM